# ఆవకాయ

కొత్తావకాయ —

అచ్చమైన ఆంధ్రులచేత తయారైన

సరికొత్త ఆవకాయ.

1 సేరు (సీసాతో) రూ. 2-4-0

1 సేరు (సీసా లేకుండా) రూ. 2-0-0 — వీశ రూ. 6-0-0

ఆశాభంగము లేకుండా త్వరపడి కొనండి

(శిశువిహార్ సహాయార్థము)

దొరుకు స్థలము :

## ఆంధ్ర మహిళా సభ

లజ్, మైలాపూరు, మద్రాసు.



## ఫోటోలు తియ్యాలని మీకు సరదా వుందా?

మీ కెటువంటి కెమెరా వున్నా సరే!

ఫిల్ములు అనవసరంగా చెడగొట్టుకోకుండా బాగా ఫోటోలు తీయటము నేర్చుకోండి!

దానితో పాటు ఫిల్ము డెవలపు చేయుట, ప్రింటు చేయుటకూడా నేర్చుకోవచ్చు.

సరదాతో పాటు స్త్రీలు ఒక జీవనోపాధికూడ నేర్చుకొనే మంచి తరుణము.

వారమునకు రెండుసార్లు పాఠములు

నెలకు రూ. 5/- ఫీజు

వివరములకు :

## ఆంధ్ర మహిళా సభ

లజ్, మైలాపూరు, మద్రాసు.

ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడుతున్నది



లక్ష్మీ ప్రొడక్షన్సు వారి

# ఇలవేలుపు

డైరెక్టర్ ప్రసాద్ గారి పర్యవేక్షణలో నిర్మించబడినది



అంజలి...నాగేశ్వరరావు...రేలంగి

జమున...కృష్ణకుమారి...గుమ్మడి

దర్శకత్వం

యోగానంద్



త్వరలో వస్తోంది!...





అనుపమ వారి...

# ముద్దుబిడ్డ

డైరెక్షన్... తిలక్

ఆంధ్ర ప్రభాత్ రిలీజ్ · వివరములకు





ముఖచిత్రం

యువమహారాజ్ఞి కాకతీయ రుద్రమదేవి.

చిత్రకారుడు · శ్రీ బాబూ

# యువమహారాజ్ఞి కాకతీయ రుద్రమదేవి

"యోరుద్రోరజతాచలే స్థితిమగా దర్ధాంగనారీః పురా।
సోయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాంగనారీః స్థితః ॥"

గణపతి దేవునికి సోమాంబకు జన్మించిన పుత్రిక రుద్రమ దేవి. ఈమె జన్మించగానే, గురువు విశ్వేశ్వర శివ దేశికుల యాజ్ఞానుసారము, గణపతి ఈ శిశువునకు రుద్రమ దేవుడని నామకరణము చేసి, పుత్రోదయ మయ్యెనని రాజ్యమున చాటించెను. రుద్రమ దేవి యెప్పుడును పురుష వేషమందే యుండి రాజ్యభారము వహించుటకు కావలసిన విద్య లన్నిటిని నేర్చెను. గణపతి ఆమెకు యువరాజ పట్టము గట్టెను.

తండ్రి యనంతరము తనకు సంక్రమించిన సామ్రాజ్య రమను, ఏవిధమునను తరుగకుండ రుద్రమ రక్షించుకొనెను. రుద్రమ రాజ్య పరిపాలనా విశిష్టత ఆమె శాసనముల వల్ల దెలియుచున్నది. ఈమె తండ్రిచే రాజ్య తంత్రజ్ఞానము చక్కగ గ్రహించిన దగుటచే యాదవ దండయాత్రల నుండి రాజ్య రక్షణకై రాజధాని, శిథిలదుర్గ భాగములను బాగు చేయించి కోటల సురక్షితము గావించెను. రాజధాని చుట్టు గంపకోట కట్టించెను. రుద్రమ రాజ్యమునందును, సరిహద్దు లందును అపుడు లేచు విప్లవములను అణచుచు, శత్రురాజుల నోడించుచు, యుద్ధమునందు అపూర్వ శౌర్య ప్రతాపముల ప్రదర్శించి పురుషులేకాదు స్త్రీలు కూడ పరిపాలనార్హులని నిరూపించిన ఆదర్శ ఆంధ్ర మహిళ. దేశమున శాంతి భద్రతలు నెలకొల్పి బహు సమర్థతతో దాదాపు ముప్పదియైదు సంవత్సరములు (1261-1295) కాకతీయ సామ్రాజ్యమును పాలించిన మహారాజ్ఞి రుద్రమ దేవి.

---

# ఆంధ్ర మహిళ

సంపుటి 13 :: జూలై '56 :: సంచిక 7

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు :
శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

ముద్రణ :
ఆంధ్ర మహిళా ప్రెస్

## రచయితలకు

ఆస్తి హక్కు వల్ల సంఘములో భారత స్త్రీకి కలిగే స్థానమును, ఆమెకు సాంసారిక జీవితములో కలిగే లాభ నష్టములను గురించి నాలుగు పేజీలకు (అచ్చులో) మించకుండా తమ తమ అభిప్రాయములు తెలిపితే. అందుత్తమోత్తమ రచనకు వారితో పికము యివ్వబడును. మొదటి మూడు ఉత్తమ రచనలు "ఆంధ్ర మహిళ"లో ప్రకటించబడును.

— సంపాదకురాలు.

## విషయ సూచిక




సంపుటి 13 :: జూలై 56 :: సంచిక 7

# సమస్యలా?

ఆంధ్ర దేశము రూపే మారనున్నది. అక్టోబరు నెలలో ఆంధ్ర తెలంగాణాలు ఏకమై విశాలరాష్ట్రముగా రూపొందనున్నది. ఆ విశాలరాష్ట్రమునకు రాజధాని కాగల హైదరాబాదు పట్టణమునకు మన ఆంధ్ర ఆఫీసులు, ఉద్యోగులు వారి కుటుంబములు బయలు దేరవలసియున్నది. వారి కెట్టి ఇబ్బందులు లేకుండయుండుటకుగాను పరిపాలనా సౌలభ్యమునకు ఆంధ్ర ప్రభుత్వము ఇప్పటినుండే తగిన ఏర్పాటులు చేయవలసియున్నది.

మొన్ననే హైదరాబాదులో ఆంధ్ర తెలంగాణా మంత్రులు కలసి గృహ సమస్య, విద్యా సమస్య, భూసంస్కరణాల సమస్యలను గురించి చర్చించిరి.

తగిన గృహావసతి ఏర్పాటు చేయనున్నారు. విద్య సమస్యకూడా లేదనే అంటున్నారు. ప్రీ యూనివర్సిటీ కోర్సులు, సంస్కృతపాఠముల ఆరంభముతో మన విద్యావిధానములో చాలా మార్పు రానున్నది. అది శ్రేయస్కరముగనే పరిణామము పొందగలదో లేదో ఇప్పుడే చెప్పుట సాహసము. కాలమే నిర్ణయించవలసియున్నది.

భూసంస్కరణల విషయము ఎంత త్వరగా ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చిన అంత మంచిది. ఇప్పటికే చాలా కాలయాపన జరిగినది. భూస్థితికి ఒక సీలింగు నిర్ణయించితే దానితో పాటు ఇతర ఆదాయాలకుకూడ ఒక సీలింగు నిర్ణయించవలయును. అట్టి నిర్ణయము చేయుటకు ఇప్పుడు సమయము కానిచో ఆ విషయమే ఇప్పుడు ఆలోచనలో పెట్టుకొనక ఇతర అవసరమైన విషయములమీద శ్రద్ధ తీసుకొనుట ప్రభుత్వమునకు ధర్మమేమో.

ఈ మూడువిధముల మార్పులవలననేగాక ఆంధ్ర దేశము త్వరత్వరగా రూపు మార్చుకొనుచున్నది.

## సమస్యలా ?

ఈ సమయమందే శ్రీ నెహ్రూ మన దేశమునుండి పయనమై విదేశ పర్యటన ఆరంభించనున్నారు. వీరి విదేశ పర్యటన కేవలము రాజకీయముగానేగాక ప్రపంచమంతటా శాంతీ, ధర్మమూ నెలకొనుటకు ప్రయోజనకారి కాగలదని భారతీయులు భావిస్తున్నారు.

భారతదేశపు తాటస్థ్య వైఖరి పిరికితనము వల్లగాని, గోడమీద పిల్లి వాటముగాని కాదని ప్రపంచమునకు తెలియపరచుచూ, వివిధదేశాలు సమరసభావముతో శాంతియుత సహజీవనానికి గల ఆటంకములన్నీ నిర్మూలించుటకు 'పంచశీల'ను శక్తివంతముగా ప్రపంచమంతా అమలుజరుపుటయే ఏకైక విధానము అని పండిత నెహ్రూ ప్రపంచానికి ఈ విదేశ యాత్రలో తెలుపగలరని విశ్వసించుచున్నాము.

*　　　*　　　*　　　*

"పంచశీల" అనే పదము పుట్టుపూర్వోత్తరాలను గురించి — భారత చరిత్రలోని వివిధ ఘట్టాలలో దానికి కలిగిన అర్థవ్యాప్తిని గురించి వివరించే కరపత్ర మొకటి తయారైనదట. ఇందు వివిధ దేశాల సంబంధబాంధవ్యాలలో 'పంచశీల' రీత్యా యిటీవల కలిగిన పరిణామాలను గురించియు, పెక్కు దేశాలు దానిని ఆమోదించిన విషయము గురించియూ కూడా వివరింపబడినదట.

---


శరీర సౌందర్యముపై ప్రసంగము

మీ శరీరచ్ఛాయను యౌవనవంతముగాను, ఆరోగ్యవంతముగాను ఉంచుటకు వ్యాయామము, పరిశుభ్రమైనగాలి ముఖ్యావసరములు.
కాని మీ చర్మమును పైగా జాగ్రత్తపరచుకొనుట అవసరము

మైసూరు సేండల్ సబ్బు

ప్రశస్తమైన సరకులతో తయారుకాబడినది.
చర్మమును శుభ్రపరచి, శరీరమునకు కాంతిని ఇచ్చును.

నేడే వాడి చూడండి

మైసూర్ సేండల్ సబ్బు

శరీర సౌందర్యమునకు ముఖ్యావసరము

ఎన్నికగన్న అన్ని షాపులలోనూ లభించును

గవర్నమెంటు సోపు ఫేక్టరీ

బెంగుళూరు

# పుష్కరంనాటి ఆంధ్రమహిళ

## గాంధీజీ-వేవెల్ లేఖలు

"చివరికి మీ ఆర్థిక విషయాలు మేము చక్క బెడతాము; రాజకీయాలకేం, అవే సద్దుకుంటాయి!" అన్నరీతిగా వేవెల్‌గారు తమ అభిప్రాయం తేల్చారు

"అయితే ప్రజలను నిజమైన ప్రతినిధుల ద్వారా పాలనచేసే కాలమింకా రాలేదా?" అని వెంటనే గాంధీజీ ప్రశ్నించారు.

దేశమంతా ఆంగ్ల ప్రభువులను ఈ ప్రశ్నమునే నిత్యం అడుగుతోంది. గాంధీజీకి సమాధాన మివ్వని ప్రభుత్వం, దేశానికి ఏమి సమాధాన మిస్తుంది? ఈ ప్రశ్నకు జవాబు రానంతసేపు భారతీయ ప్రజలకు గాంధీమహాత్ముని మార్గసూచనయే చేయూత!

— సంపాదకీయం

## ఆర్థిక స్వాతంత్ర్యం

స్త్రీ సంఘం ఆర్థిక స్వాతంత్ర్యం పొందవలె నంటే, తగిన విద్యాలాభం పొందడం మొదటి అవసరం. ప్రస్తుత కాలంలో స్త్రీలకు ఉపాధ్యాయవృత్తికి అనువైన విద్య మాత్రమే లభ్యమవుతున్నది. ఇతర వృత్తులన్నిటికి అర్హత కలిగించే విద్యా విధానం ఇప్పుడు అమలులోలేదు. ఆర్థిక విషయంలో నిజమైన బలం చేకూరవలెనంటే, స్త్రీలు వివిధములైన చేతి పరిశ్రమలు, వ్యవసాయం, ఇతర పారిశ్రామిక విజ్ఞానం మొదలైన వానిలో విద్యాలాభం పొందాలి. మహాత్మాగాంధీజీ ప్రతిపాదించిన ప్రాథమిక విద్యా ప్రణాళిక (Basic Education Scheme) అమలులో పెట్టిన యెడల, పైనచెప్పిన అవకాశములు స్త్రీలకు లభించుటకు మార్గం ఏర్పడ గలదు.

— సరళాదేవి
ఉత్కళ శాసనసభ్యురాలు.

## పురుషునికి చేయూత

నేటి జగత్ప్రళయ సంగ్రామంలో అన్ని దేశాలలోను స్త్రీలు చూపుతూ ఉన్న త్యాగం, చేస్తూఉన్న సహాయం, ఆయాదేశ ప్రభుత్వాలకు పూర్తిగాతెలుసు; సామాన్య ప్రజలకు కొంతవరకేతెలుసు. యుద్ధభటుడు తొడిగే మేజోడులో, తినే రొట్టెలో, మోసే తుపాకిలో, కాల్చే మందుగుండులో, చమటతుడుచుకునే జేబురుమాలులో, గాయానికి కట్టుకున్న బేండేజీ గుడ్డలో, రోగంలో తాగే మందులో, పొందే చికిత్సోపచారాలలో ఆడదాని అభిమానం, సహాయం, ఆశీర్వాదం ఉన్నాయి! పురుషుడు యుద్ధ భూమిలో శ్రీ కృష్ణుని పరాక్రమంతో పోరాడుతూ ఉంటే, స్త్రీ అతనికి సత్యభామవలె చేయూతనొసగి తోడ్పడుతూ ఉంది.

— తాతాకృష్ణమూర్తి

## సూర్యుడు-చంద్రుడు

సూర్యుడికీ చంద్రుడికీ ఇంకో తేడా ఉంది. సూర్యుడు చాలా వేడైనటువంటి వాయువు. అందుచేత, మనం తొమ్మిదికోట్ల మైళ్ళు దూరంలో ఉన్నా సూర్యుణ్ణించి తీక్ష్ణమైనవేడి,వెలుతురు మనకువస్తోంది. చంద్రుడు చల్లారిపోయిన మట్టిముద్ద. సహజమైన వెలుతురుగాని, వేడిగానిలేదు. సూర్యుడి వెలుతురే చంద్రుడిమీదపడి ప్రతిబింబించి, మనకుచంద్రకాంతిగా కనబడుతోంది. ఏలాగంటే అద్దానికి సహజంగా కాంతిలేదు. కాని, దీపం వెలుతురు అద్దంమీద పడగానే, అద్దంనుంచి ఒకవెలుగు ప్రతిబింబించి మనకు కనబడుతుంది. దీపానికి సహజమైన కాంతి ఉంది. అద్దానికి లేదు. కాని అద్దం ప్రతిబింబిస్తుంది. అలాగే చంద్రుడు కూడా. సూర్యుడికి సహజమైన వెలుతురు ఉంది. అది చంద్రుడిమీద పడి ప్రతిబింబించి, చంద్రుణ్ణించి వచ్చిన వెన్నెలగా కనపడుతోంది.

— గో. రా.

# సమాజాలు - సంఘ సేవ

## విశాఖ జిల్లా కన్వీనర్ నివేదిక.

ఆంధ్రరాష్ట్ర సంక్షేమ సలహా సంఘం ఆధ్వర్యమున విశాఖ జిల్లాలో ఈ నెల బాలచెర్వు కేంద్రమునకు ఉప కేంద్రము కణితి గ్రామంలో 10-6-56 తేదీన నెలకొల్ప బడెను. అచట గ్రామ సేవికను యేర్పరచి అచట గల స్త్రీలకు పిల్లలకు ఆట పాటలు, వయోజన విద్య, చేతి పనులు, గ్రామ పారిశుద్ధ్యం, స్త్రీ బేసిక్ తరగతులు, మొదలైనవి నడుపుటకు యేర్పాట్లు చేయబడెను. అధ్యక్షు రాలైన డాక్టర్ శ్రీమతి మల్లెమడుగుల విజయలక్ష్మి (సీతానగరం) తమ ఉపన్యాసంలో గ్రామాభివృద్ధిని గురించి, స్త్రీ పురుషులేవిధంగా తమ బిడ్డలను భావి పౌరులుగా చేయవలసిందో ఉద్బోధించిరి. గాజువాక బహుళ కేంద్రమునకు యీ నెల 13-6-56 న మింది గ్రామంలో ఉపకేంద్రము శ్రీమతి బుర్రా కమలాదేవి గారి అధ్యక్షతను నెల కొల్ప బడెను. నెల్లిముక్కు బహుళ ప్రయోజన కేంద్రమునకు గంగవరంలో ఉప కేంద్రము యీ నెల 15-6-56 న స్థాపింపబడెను. ప్రజలందరు అమితోత్సాహముతో కేంద్రప్రారంభోత్స వాదులలో పాల్గొని విజయ వంతం చేసిరి.

దిగుమర్తి జానకీబాయి
విశాఖ జిల్లా సంక్షేమ కన్వీనర్

## ఇరకం — సూళూరు పేట.

యీ నెల 9 తేది సాయంకాలం 5 గంటలకు ఇరకం ద్వీప గ్రామంలో సూళూరు పేట సమాజ కల్యాణయోజన కన్వీనరు శ్రీ మతి కామేశ్వరమ్మ అధ్యక్షతన సభ జరిగెను.

ఆంధ్ర రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంఘ సలహాసభ్యులు శ్రీ న్యాయపతి రాఘవరావుగారు సాంఘిక సంక్షేమ కార్య క్రమములు, బాల సంఘముల నిర్మాణ ప్రాముఖ్యములను గురించి ప్రసంగించారు.

గ్రామ సేవికలు శ్రీ మతులు రాజలక్ష్మి, చటార్జి వి దేవి గార్ల ఆధ్వర్యమున బాల బాలికలు గేయాలు పాడి నృత్యములు చేశారు

గ్రామ ప్రణాళికా సంఘ అధ్యక్షుడు— డా॥ జీ. ఆర్. కన్నయ్యా నాయుడు సంఘ శ్రేయస్సుకు ప్రజల సేవా సహాయములు ముఖ్య అవసరమని నుడివిరి.

ప్రెసిడెంటు
విలేజి ప్రోజెక్టు కమిటీ.


ఆరోగ్య
సౌభాగ్యములకు






స్త్రీల ప్రత్యేకమైన జబ్బులు. హిస్టీరియా, మలబద్ధకము, తలనొప్పి, వెన్నునొప్పి మొదలగు వాటి కిది వర ప్రసాదము.

వివరములకు
కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు 14.
తెలుగు జిల్లాలకు ఏజెంట్లు :
శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
బెజవాడ.

# ఇంద్రజాలము కాదు - మహేంద్రజాలము కాదు

ఆంధ్ర మహిళాసభ ప్రాంగణములో 18-6-56 సాయంకాలము 5 గంటలకు ఒక సభ ఏర్పాటు చేయబడినది.

మిట్ట పల్లములు సమమయే ఈ రోజులలో ధనవంతులు బిదలు లేని సామ్యవాద సంఘము పర్పడనున్నప్పుడు, రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రకారము మన దేశములో ఎంతో మార్పు రానున్నది. కావున ఆ మార్పు వలన కలిగే ఇబ్బందులు, లాభ నష్టాలు ఎట్లు ఎదుర్కొనవలసినదీ, రానున్న మార్పులవల్ల మనకెక్కువ నష్టము రాకుండ అత్యంతలాభము ఎట్లు కలుగ చేసుకునేదీ భావి జీవితములో మన దేశములో ధనమునకుండు విలువ, అట్టి పరిస్థితులలో నేషనలైజుడు ఇన్సూరెన్సు వలన పెక్కు లాభములు ఎట్లు కలిగేదీ తదితర విషయములూ తెలుపగలరనియు కోరుతూ శ్రీ కె. ఆర్. ఆదికేశవులుగారిని సభాసదులకు శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్‌గారు పరిచయముచేసిరి. ఉపన్యాసకులు సవిస్తరముగా ఇన్సూరెన్సు చరిత్ర-నేషనలైజుడు ఇన్సూరెన్సు లాభములు తెలిపిరి. ఎంతో సామర్థ్యముతో నేషనల్ ఇన్సూరెన్సును అమలు పరుచుచున్న మన ఆర్థిక మంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్‌గారి దూరదృష్టి తెలుపుచూ రెండవ పంచవర్ష ప్రణాళికలో ఇన్సూరెన్సు భారతీయుల కెట్టి కవచముగా ఉండగలదో తెలిపిరి. అందుచేతనే ప్రభుత్వోద్యోగులకు నిర్బంధ ఇన్సూరెన్సు, ఇదివరలో స్త్రీలకున్న నిర్బంధములు తొలగించుట, మల్టీపర్పసు ఇన్సూరెన్సు, కుటుంబరక్షణ ఇన్సూరెన్సు మొదలగు పెక్కు ప్రత్యేకరకముల ఇన్సూరెన్సులలోనున్న క్రొత్త పద్ధతులను సభాసదులకు తెలియపరచిరి.

ఏ రష్యా, చైనాలలోనో, దేశపరిస్థితులు చూసి భ్రమించనవసరము లేదనియు, త్వరలోనే భారత దేశములోనే శాంతి మార్గమున రానున్న గొప్ప మార్పు రెండవ పంచవర్ష ప్రణాళికతో రానున్నదనియూ, అట్టిది ఎట్టి ఇంద్రజాలము మహేంద్రజాలము గాదు ప్రభుత్వము అరచేతిలో స్వర్గము చూపుటగాదు, త్వరలోనే భారత దేశమునకు అత్యంత సుఖ సౌభాగ్యములు గలుగ గలవనియూ వుపన్యాసకులకు, సభాసదులకు తెలుపుతూ కార్యదర్శిని వందన సమర్పణతో సభ ముగిసెను. —



## విజయం

ఆంధ్రమహిళా విద్యాలయం నుండి 1956 మార్చిలో ఇ. ఎస్. ఎల్. సి పరీక్షలకు వెళ్లిన 19 గురు విద్యార్థినులలో ఈ దిగువ ఉదహరించిన 12 గురు ఉత్తీర్ణులైరి.

| | | |
|---|---|---|
| (1) వి. పార్వతి | (2) జి. సుందరి | (3) జి మోహన్ |
| (4) యల్. సరోజ | (5) బి. నాగలక్ష్మి | (6) యస్. పట్టమ్మాళ్ |
| (7) ఆర్. సరస్వతి | (8) ఎ. కె. శంకరి | (9) జి. తిమ్మాబాయి |
| (10) పి. బి. మణి | (11) పి. లక్ష్మీనరసమ్మ | (12) వై. యస్. లక్ష్మి |

# తిరుమ లేశ?

శ్రీ చదలవాడ కోటినరసింహము

మూఁడు కాళ్ళ ముసలి ముంతెఁడు కలు ద్రావి
కొయ్యమ్రింగి, కక్కుఁ గోర నిండ
పేరటమ్మ మాట విని, ముందుఁ బరుగెత్తు
దీని భావ మేమి? తిరుమ లేశ!

ఆకసమున గాలి కల్లల నాడంగ
కమ్మరీఁ డెవండొ కంటఁ బడక
కూర్చి కట్టి పెట్టెఁ గొడవండ్లు, లెక్కలు
దీని భావ మేమి? తిరుమ లేశ!

పుట్టి పెద్ద దగుచుఁ బుట్టింటి వారికి
అన్న మింత పెట్టి యాదరించు
పట్టి పుట్టెనేని మట్టి పాలగుఁ దల్లి
దీని భావ మేమి? తిరుమ లేశ!

తెలియు నట్లు పూచి, తెలియకుండఁగఁ గాయు
నంగనాచి, దాని నమ్మరాదు
కాయ కాల్చి తినినఁ గమ్మగా నుండును
దీని భావ మేమి? తిరుమ లేశ!

నీరు మేఁతఁ గొనదు, నిట్ట నిల్వుగ నుండు
ఎందతైన మీఁది కెక్కవచ్చు
వంగ కుండు, బాధపడ దిసు మంతయు
దీని భావ మేమి? తిరుమ లేశ!

కుట్టు పనులు నేర్చుకొన్నట్టి గట్టిది
జంట తోఁక లుండు దంట తుంట
పనికి నడుము కట్ట భంగమౌఁ దోఁకలు
దీని భావ మేమి? తిరుమ లేశ!

పగలు, రేయి నీడ యగపడ కుండంగఁ
బోవు నీటి యందు, మొసలి గాదు
బట్ట కట్టఁబడును, బ్రాణమ్ము లే కుండు
దీని భావ మేమి? తిరుమ లేశ!

భావియందు నంబు పడుట చూచుచె కాని
ధీరుఁ డెవఁడు వెలికిఁ దీయలేడు
అంబు పడెడి సమయ మరయ నశక్యంబు
దీని భావ మేమి? తిరుమ లేశ!

ఒకటి ముందు నడచు, నొకటి వెన్కనె పోవు
రెంటిమీఁద నెక్కు దంట యొకఁడె
జంటఁ గలుపు దంట కంటికిం గనరాఁడు
దీని భావ మేమి? తిరుమ లేశ!

దేని కేది పుట్టెఁ దెలియ దెవ్వని కైనఁ
దెలిసినట్టి వాని దేవుఁ డండ్రు
కలహమునకు నదియె కారణ మగుచుండు
దీని భావ మేమి? తిరుమ లేశ!

---

దీని భావ మేమి తిరుమలేశ? జవాబులు

(1) గంధపుసాన (2) చింతకాయలు (3) అరఁటిచెట్టు (4) వేరుశనగ (5) ఆరుఁగు
(6) దారముగల సూది (7) పడవ (8) వాన (9) పావకోళ్ళు (10) చెట్టు లేక విత్తు



# రాజకీయాలు

శ్రీ జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య

## బుద్ధజయంతి

మే నెల 24 వ తేదీనుంచీ ప్రపంచ విస్తృతంగా గౌతమబుద్ధుని పంచవింశ శతవార్షికోత్సవాలు మహా వైభవోపేతంగా జరిగాయి. కన్యాకుమారినుంచి కలకత్తా వరకూ, కాబుల్‌నుంచి కంబోడియావరకు, బ్రిటన్, అమెరికా, రష్యా, చైనా, సింహళం మొదలుగాగల అనేక దేశాలలో ఈ ఉత్సవాలు కొనసాగాయి.

తన సత్యాన్వేషణ, ఆధ్యాత్మిక సాధనల ఫలితంగా రూపొందించిన లోక దుఃఖ నివారణోపాయాలు 2500 సంవత్సరాలకు పిమ్మటకూడా అనుసరణీయమై వుండ డంలోనే బుద్ధుని మాహాత్మ్యమున్నదని ప్రెసిడెంట్ డాక్టర్ రాజేంద్రప్రసాద్, కులమత ద్వేషాలకు, మూఢ విశ్వాసాలకు, కుత్సిత దేవతారాధనకు స్వస్తి చెప్పిన బుద్ధుని జీవిత విధానం సర్వజనానుసరణీయమని ప్రధాని పండిట్ నెహ్రూ ఢిల్లీ ఉత్సవాల సందర్భంగా ఉద్ఘాటించారు.

పరమోత్కృష్ట ధర్మాలైన సత్యం, అహింసలను మానవజాతికి బోధించిన శాక్యముని సర్వకాల జన వంద్యుడుగదా!

## పాకిస్థాన్ కొత్త పేచీ

ఉన్నట్లుండి చిత్రాల్ సంస్థానం పాకిస్థాన్‌లో విలీన మైందని పాకిస్థాన్ కొత్త వాదం ప్రారంభించింది. చిత్రాల్ కాశ్మీర్ మహారాజుల అధీనంలో 1676 వ సంవత్సరంనుంచీ వుంటున్న ప్రాంతం. ఈ వాదం ఎప్పటికీ చెల్లనేరదని ప్రధాని పండిట్ నెహ్రూ మే 26 న పార్లమెంటులో ఖండితంగా చెప్పారు.

ఇది అక్రమమని పాకిస్థాన్ నాయకులు ఘోషించారు. ఏదోవిధంగా రచ్చ కెక్కకపోతే కాలం గడవదు కాబోలు.

## రైలుప్రమాదం

మే 25 న మరొక రైలు ప్రమాదం సంభవించింది. విడ్నాపూర్‌నుంచి ఖర్గపూర్‌కు రైల్వే కార్మికులను తీసుకొని వస్తున్న రైలును - స్టేషన్‌కు దగ్గరగావున్న ఒక స్టేషన్‌వద్ద అంతకుముందు మూడు రోజులనుంచి సమ్మెచేస్తున్న కార్మికులు నిలిపివేసి, ఇంజన్‌లోని డ్రైవర్‌ను, ఫైర్మన్‌ను బయటకులాగి, వారిని కొట్టి డ్రైవర్ లేకుండానే ఇంజన్‌ను వదిలివేయడంతో అది స్టేషన్‌లోని ప్లాట్‌ఫారంమీదికి ఎక్కి, స్నానశాలను గుద్దుకొంది. 63 మంది తీవ్రంగా గాయపడ్డారు.

ఇంతకంటె అమానుష దౌర్జన్యం ఏదీ వుండబోదని ప్రధాని పండిట్ నెహ్రూ విమర్శించారు.

ఇంతకీ తప్పెవరిది? కార్మికులను ప్రోత్సహించిన దుష్టవిద్రోహక శక్తుల కుటిల రూపానిది.

## పాకిస్థాన్‌లో ప్రెసిడెంట్ పాలన

తూర్పు పాకిస్థాన్‌లో రాజ్యాంగాను గుణమైన పరిపాలన కొనసాగే పరిస్థితులు లేవని గవర్నర్ ఫజులుల్ హక్ ఫిర్యాదు చెయ్యడం ఫలితంగా పాకిస్థాన్ ప్రెసిడెంట్ ఇస్కందర్ మీర్జా అక్కడి ప్రభుత్వాధికారాలను, గవర్నర్ అధికారాలను తానే స్వీకరించాడని పాకిస్థాన్ రేడియో మే 26 న ప్రకటించింది.

అధికారం తాపత్రయానికి సహజ ఫలితం!

## కాంచీపురంలో సర్వోదయ సమ్మేళనం

కాంచీపురానికి దగ్గర ఏర్పాటు చెయ్యబడిన సర్వోదయపురంలో మే 27 నుంచి మూడు రోజులుగా సర్వోదయ సమ్మేళనం సాగింది. భూదానయోగ తపస్వి శ్రీ వినోబాజీ ఆధ్వర్యాన జరిగిన ఈసమావేశంలో ప్రెసిడెంట్ ప్రసాద్, శ్రీ రాజాజీ, జయప్రకాశ్ నారాయణ

కాంగ్రెస్ అధ్యక్షుడు దేబర్ యితర నాయకులు అనేకులు ప్రసంగిస్తూ గ్రామీణ ఉద్యమంగా భూదాన నిర్వహణావశ్యకతను గురించి, బేసిక్ విద్యావశ్యకతను గురించి భారత ప్రజలెదుర్కొంటున్న వేర్వేరు సమస్యలను గురించి సాంగంగా చర్చించారు. ఈ అఖిల భారత సమ్మేళనానికి దేశంలోని నలుమూలలనుంచి 5,000 మందికి పైగా ప్రతినిధులు హాజరైనారు.

సర్వోత్కృష్టమైన భూదాన లక్ష్య సంసిద్ధి దేశంలో దారిద్ర్య నిర్మూలనకు, సుభిక్షానికి దారితీయగలదనడం నిర్వివాదాంశం.

## ఫ్రెంచి స్థావరాలు

ఇండియాకు కొన్ని వందల ఏళ్ళక్రితం వర్తకంకోసం బ్రిటిష్‌వారు వచ్చి తిష్ఠవేసి దేశ పరిపాలనాధికారాన్ని హస్తగతంచేసుకున్నట్లే బుడతకీచులు గోవాను, పరాసులు ఏనాం, పుదుచ్చేరి, మాహే, చంద్రనగర్‌లను ఆక్రమించుకొన్నారు. అప్పటినుంచి వీటిలో ఫ్రెంచిభాష, ఫ్రెంచి కోర్టులు - పాలన, సంస్కృతి అంతా ఫ్రెంచిమయమై పోయింది. భారత స్వాతంత్ర్య సిద్ధికి పిమ్మట అక్కడి ప్రజలు తమ స్వదేశంలోనే విలీనీకరణకు ఆలజడి జరిపారు. ఫ్రెంచివారు సాధారణంగా అంగీకరించారా? కాల్పులు జరిపారు. హింసించారు. అమానుష కృత్యాలనేకానికి ఒడిగట్టారు. కాని ప్రజోద్యమం నెగ్గింది. ఆస్థావరాలను ఇండియాకు వదిలివేశారు. వాటిని చట్టరీత్యా మే 28 న ఇండియాకు అప్పగించివేశారుకూడా.

ఇంకా ఒక్క బుడతకీచులు అంటిపెట్టుకొని ఆర్భాటాలు చేస్తున్న గోవా విమోచనాన్ని ఎదురుచూస్తు వుంది.

విధిలేక కాలనీలను వదులుకొంటున్న పాశ్చాత్య అగ్రరాజ్యాలు పోర్చుగల్ నియంతకు తప్పుకోమని చెప్ప డానికి తెగించి చెప్పలేకపోతున్నాయి. ఇది ప్రతిష్ఠకోసం ప్రాకులాట.

## బర్మా బియ్యం

దేశంలో కొన్ని ప్రాంతాలలో యీ మధ్య బియ్యం ధరలు హెచ్చడంతో దొంగ లాభాల ప్రియులైన వర్తకుల ఆటలను కట్టివేసే వుద్దేశంతో కేంద్ర ప్రభుత్వం తన వద్ద నిలవవున్న సరకును విడుదల చెయ్యడమేగాక బర్మా నుంచి టన్ను 34 పౌనులు రేటుకు 20 లక్షల టన్నుల బియ్యాన్ని కొనడానికి ఒడంబడిక చేసుకొంది.

దొంగ లాభాలు మరిగిన వర్తకులపై కఠిన శిక్షలు విధిస్తే దిగుమతుల అవసరం కొంతవరకైన తగ్గవచ్చును గదా!

## విజ్జోమీలొంగుబాటు

అస్సాం దగ్గర నాగపర్వత ప్రాంతంలో తమకు స్వపరిపాలనాధికారం యివ్వాలని ఆందోళనచేస్తుసాయుధ దౌర్జన్యాలకు, విధ్వంసక చర్యలకు పూనా కొన్ని నాగ విప్లవకారుల ఉద్యమంలోని ముఖ్యనాయకులలో ఒకడైన విజ్జోమీ కొహిమాకు వచ్చి ప్రభుత్వాధికారులకు లొంగిపోయాడు. ఉద్యమ విచ్ఛిత్తి తథ్యమని అంతా అంటున్నారు.

ఈ మధ్యనే పార్లమెంటులో నాగజాతి విప్లవకారులకు ఆయుధాలెక్కడివని ఒకరు నెహ్రూను అడిగారు.

అయితే అవి పాకిస్థాన్‌కు "ద్వితీయ రంగం" వంటి తూర్పు పాకిస్థాన్‌నుంచి వచ్చివుండవచ్చునని ఆయన స్పష్టంగా చెప్పలేదు. ఏమోగాని.

## కాల్కా, అంబాల స్టేషన్‌లలో కాల్పులు

నార్తరన్ రైల్వేలోని కాల్కా రైల్వే వర్క్‌షాప్ కార్మికులు మే 29 వ తేదీని రైల్వే అధికారులు తమ కోర్కెలను నెరవేర్చకపోవడంపట్ల అసమ్మతి సూచనగా ప్రదర్శనలు జరపడమేగాక, సిమ్లాకు వెడుతున్న రైల్వే బోర్డు చెయిర్మన్ రైలు కారును అడ్డగించి, ఆగడానికి పూనుకోవడంతో పోలీసులు కాల్పులు జరిపారు. ఆరుగురు మరణించారు.

కాల్కా అంబాలాకు 35 మైళ్ళ దూరంలోవుంది. ఢిల్లీ, అంబాలా స్టేషనులలో ఈ కాల్పులపట్ల నిరసనగా సమ్మెలు జరిగాయి. దౌర్జన్య చర్యల ద్వారా తమ వాంఛలను నెరవేర్చుకొనడానికి రైల్వే కార్మికులు పూనుకోవడం తగదని రైల్వే మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి అన్నారు.

## ఏ.ఐ.సి.సి. సమావేశం

బొంబాయిలో సిద్ధార్థనగర్‌లో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ జూన్ రెండవ తేదీని సమావేశమయింది. కాంగ్రెస్

అధ్యక్షుడు శ్రీ డేబర్ తన అధ్యక్షోపన్యాసంలో కాంగ్రెస్‌వారు తమ విభేదాలను విస్మరించి సమైక్యతతో జాతికి సవ్యమైన మార్గం చూపాలని అభ్యర్థించారు.

భాషా సంబంధమైన మైనారిటీ వర్గాలకు రక్షణ కల్పించాలని, దౌర్జన్య చర్యల నివారణకు అన్ని పార్టీలు కృషి చెయ్యాలనీ, కాశ్మీర్‌లో విదేశాల జోక్యం సహించమని, గోవా విమోచనోద్యమాన్ని సానుభూతితో సమర్థిస్తామని, ద్వితీయ ప్రణాళిక నిర్వహణకు సర్వశక్తులు సమీకరించబడాలని సూచిస్తూ ఏ.ఐ.సి.సి. తీర్మానాలు చేసింది.

ఈ సమావేశంలోనే బొంబాయి భవితవ్య సమస్యపై ప్రధాని పండిట్ నెహ్రూ ఒక ప్రకటన చేస్తూ ఆనగరం ఐదేళ్ళపాటు కేంద్రం పాలనలోనే వుండాలని, ఆతర్వాత దాని భావిని ప్రజలే ప్రజాస్వామిక సూత్రానుగుణంగా నిర్ణయించుకోగలరనీ ప్రకటించారు.

ఈ ప్రకటన వెలువడిన తేతడవుగా నగరంలో కల్లోలం ప్రచండ స్వరూపం ధరించింది. నాయకుల కార్లపై సంయుక్త మహారాష్ట్రాభిమానులు రాళ్ళురువ్వారు. బాహాటంగా తిట్టారు. అభాసచేశారు. దౌర్జన్యాలు లేపారు. పోలీసులు కాల్పులు జరపక తప్పలేదును. కాల్పులలో ఒకరు మృతినొందారు. సుమారు 700 మంది అరెస్టు చెయ్యబడ్డారు. రెండురోజులపాటు జరిగిన ఏ.ఐ.సి.సి. సమావేశం ఆరు తీర్మానాలు ఆమోదించినమీదట ముగిసింది.

## పాశ్చాత్యరాజ్యాలకు సవాల్

ప్రధాని పండిట్ నెహ్రూ జూన్ నాలుగవ తేదీని బొంబాయిలోని గోవనుల మహాసభలో ప్రసంగిస్తూ గోవా సమస్యపట్ల తమ వైఖరిని పాశ్చాత్యరాజ్యాలు స్పష్టంగా, నిర్భయంగా స్పష్టీకరించాలని, తటస్థంగా, ముభావంగా వుండడం కలోనియలిజాన్ని సమర్థించడమే కాగలదనీ అన్నారు. సాలాజార్ నియంతృత్వపు బూకరింపులు ప్రపంచాన్ని కనుగప్పజాలవని, అది ఇండియాలో విలీనం కాక తప్పదనీ ఆయన మరొకసారి హెచ్చరించారుకూడా.

## పుష్కరాల సమాప్తి

మే 22 నుంచి, జూన్ రెండో తేదీవరకు రాజమండ్రిలో గోదావరి పుష్కరాల సందర్భంగా మొత్తం పదిలక్షల మందికి పైగా యాత్రికులువచ్చి స్నానాలుచేసి సంతృప్తచిత్తాలతో స్వస్థానాలకు వెళ్ళారని, ప్రభుత్వం చేసిన ఏర్పాట్లవల్ల యాత్రికులకు ఏవిధమైన చిక్కులు కలగలేదనీ ఆంధ్ర ప్రభుత్వ మంత్రులు ప్రకటించారు.

కుంభమేళాలాగే "గోదావరిమేళా" ఇన్నేళ్ళకైనా, దేశవ్యాప్తంగా జరగడానికిదే మొదలు.

## గాలివానలు, వరదలు

ప్రకృతి విపర్యయాల మన దేశండే అగ్రస్థానంలా కనిపిస్తోంది. జూన్ అయిదవ తేదీ ప్రాంతంలో కుంభవృష్టిమూలంగా అస్సాంలోని బ్రహ్మపుత్ర వరదలవల్ల ప్రజలు అనేకవందలమంది యిళ్ళు వాకిళ్ళు శిథిలమై నిరాశ్రయులైనారు. పెక్కుచోట్ల రైలు మార్గాలకు గండ్లుపడ్డాయి. ఆంధ్ర రాజధాని కర్నూలులో పెద్దగాలివానమూలంగా సెక్రటేరియెట్ సిబ్బంది తాలూకుగుడారాలుకూలిపోయి. ఉద్యోగులు యిబ్బందులకు లోనైనారు.

## బెంగుళూర్‌లో హత్య

మైసూర్ శాసనసభ సభ్యుడు, కాంగ్రెస్‌వాది, ప్రముఖ న్యాయవాది శ్రీ బేలూరు శ్రీనివాసయ్యంగారిని, ఆయన భార్యనూ, కుటుంబంలోని మరి నలుగురిని జూన్ అయిదవ తేదీని హత్యచేశారు. మద్రాసునుంచి గొనిపోబడ్డ యువ, దేవ అనే పోలీసు కుక్కల సహాయంతో పోలీసులు కృష్ణారెడ్డి, మునుస్వామిరెడ్డి, గోవిందరెడ్డి అనేవారిని అరెస్టుచేశారు. డబ్బు, నగలు వీరివద్ద దొరికాయి. కేసు దర్యాప్తు సాగుతూవుంది.

## రాధాకృష్ణన్‌గారి సుహృద్భావ పర్యటన

ఇండియా వైస్-ప్రెసిడెంట్ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు తూర్పు యూరోపియన్ దేశాలలోను, తూర్పు ఆఫ్రికాలోను ఏడువారాల సుహృద్భావ పర్యటనకై జూన్ నాలుగవ తేదీని బయలుదేరివెళ్ళారు.

## అయిదున్నర రోజులబడి

ఆంధ్రరాష్ట్రంలోని సెకండరీ పాఠశాలలన్నీ వారానికి అయిదున్నర రోజులు పనిచేసే పద్ధతి ప్రవేశ పెట్టబడాలని ఆంధ్ర ప్రభుత్వం ఆదేశించినట్లు ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు జూన్ ఏడవతేదీని ప్రకటించారు.

బడిపంతుళ్ళను బదిలీచేసే సందర్భంలో వారు పనిచేస్తున్న తాలూకా ఎల్లలుదాటి బదిలీలు జరగరాదని కూడా ఆంధ్ర ప్రభుత్వం ఆదేశించింది. గీర్వాణభాషను ప్రోత్సహించడానికికూడా ఆంధ్ర ప్రభుత్వం పూనుకొంది.

చేనేత పరిశ్రమకు ఆర్థిక సహాయం సమకూర్చే నిమిత్తం బ్యాంకి రూపంలోనో, కార్పొరేషన్ రూపంలోనో ఒక సంస్థను ఏర్పాటు చెయ్యడానికికూడా ఆంధ్ర ప్రభుత్వం యోచిస్తూవుంది.

### కోసి వరదలు

కోసీనది వరదలమూలంగా బీహార్‌లో 150 గ్రామాలు మునిగిపోయినట్లు జూన్ 11 వ తేదీ వార్త.

లక్షాయాభైవేలమంది ప్రజలకు నిలవనీడలేకుండా పోయింది.

### అంబర్ చర్ఖాలు

అంబర్ చర్ఖాలను విరివిగా ప్రవేశపెట్టడానికి తలపెట్టబడిన కార్యక్రమాల క్రింద ఇండియాప్రభుత్వం 1956-57 లో 75 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ కార్యక్రమం క్రింద 10,000 అంబర్ చర్ఖాలు తయారుకావలసివుంది. దీనిలో శిక్షణ గరపే నిమిత్తం 15 విద్యాలయాలు, 100 ఉత్పత్తి కేంద్రాలు ఏర్పాటు చెయ్యబడతాయి.

అంటే అనేక మందికి జీవనోపాధి. వస్త్రాల ఉత్పత్తిలో స్వయంసమృద్ధి. ఎగుమతి వ్యాపారానికి ఎక్కువ అవకాశాలూ అన్నమాట.

### శ్రీ దేశ్‌ముఖ్ రాజీనామా

ప్రజాస్వామిక విధానాల ద్వారా బొంబాయి సహా సంయుక్త మహారాష్ట్రను సాధించడానికి మహారాష్ట్ర ప్రదేశ్ కాంగ్రెస్ నిర్ణయించటం ఫలితంగా ఇండియా ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ సి. డి. దేశ్‌ముఖ్. బొంబాయి రెవెన్యూ మంత్రి శ్రీ హీరేలు నిర్ణయించుకొన్నారు.

శ్రీ హీరే రాజీనామాను ఆమోదించడానికి కాంగ్రెస్ ప్రెసిడెంట్ శ్రీ డేబర్ నిరాకరించగా ప్రధాని నెహ్రూ తాను లండన్‌నుంచి తిరిగివచ్చిన పిదప శ్రీ దేశ్‌ముఖ్ రాజీనామా ఆమోదానికి అంగీకరించారు.

శ్రీ దేశ్‌ముఖ్‌గారు, శ్రీమతి దుర్గాబాయిగారు దక్షిణాది పర్యటనకు 'మద్రాసువచ్చిన సందర్భాన శ్రీ దేశ్‌ముఖ్‌గారు బొంబాయి విషయంలో పటాస్కర్ పథకాన్ని ఆమోదిస్తే తన రాజీనామా ఉపసంహరణ విషయం పునఃపరిశీలించగలనని పత్రికా ప్రతినిధులతో అన్నారు.

### లండన్‌లో నెహ్రూ

ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూ కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో పాల్గొనే నిమిత్తం విమానంలో బయలుదేరి జూన్ 22 రాత్రికి లండన్ చేరారు. దారిలో ఆయన సిరియా రాజధాని డమాస్కస్‌లో ఆగి, సిరియన్ నాయకులతో సంభాషించారుకూడా.

వచ్చే ఫిబ్రవరిలో దేశంలో జనరల్ ఎన్నికలకు సన్నాహాలు జరుగుతున్నాయి.

### విదేశాలలో

యూగోస్లావియా ప్రెసిడెంట్ మార్షల్ టిటో జూన్ మొదటి తేదీని రష్యా సందర్శనకై వెళ్ళాడు. సోవియట్ నాయకులతో 10 రోజులు సంభాషణలు, పర్యటన జరిపి స్వదేశానికి తిరిగివచ్చాడు.

ఆయన వెళ్ళిననాడే విదేశాంగ మంత్రి పదవికి మొలటావ్ రాజీనామా యిచ్చాడు!

'భూత సంతృప్తి' జరిగినట్లే.

* * *

సింగపూర్‌కు స్వాతంత్ర్యం సంపాదిద్దామని లండన్ వెళ్ళి బ్రిటిష్‌వారితో సాగించిన మంతనాలు ఫలించనందున సింగపూర్ ముఖ్యమంత్రి డేవిడ్ మార్షల్ రాజీనామా యివ్వగా లిమ్‌యూహాక్ కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు.

* * *

బర్మా ప్రధాని ఉ. ను తన ప్రభుత్వ పక్షమైన ఫాసిస్ట్ వ్యతిరేక స్వాతంత్ర్య మండలిని ఇంకా పటిష్టం చెయ్యడానికై తన ప్రధాని పదవిని జూన్ 3 న వదులుకోగా ఉ బాస్వే ప్రధానిగా కొత్త ప్రభుత్వం ఏర్పడ్డది.

* * *

ఉన్నట్టుండి అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్‌కు చిన్న ప్రేగులలో అవరోధం ఏర్పడి జబ్బుచేసినందున జూన్ 10 న మిలిటరీ ఆసుపత్రిలో వైద్యులు శస్త్రచికిత్సచేశారు. ఆయనకు స్వాస్థ్యం కలుగుతూవుంది.

* * *

జూన్ 10 న అర్జెంటీనాలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా కొన్ని సైనిక దళాలు తిరుగుబాటు చేశాయికాని అది వెంటనే అణచివేయబడింది.

* * *

ఈజిప్టులో సైనిక శాసనం రద్దు చెయ్యబడింది. సూయజ్ మండలంనుంచి కడపటి బ్రిటిష్ సైనికదళంకూడా ఉపసంహరించబడింది. ఈజిప్టు కొత్త రాజ్యాంగంపై జూన్ 23 న ఎన్నికలు జరిగాయి. కర్నల్ నాజర్‌నే ప్రెసిడెంట్‌గా ప్రజలు ఎన్నుకున్నారు.



# అలుక

శ్రీమతి పండితారాధ్యుల సుశీలాదేవి

అది మహారాజ శుద్ధాంత, మందిరంబు
అందులో మారుమూలన, యలుక గదిలొ
హంసతూలిక పాన్పున, నలతజెంది
ముసుగునిడి పవ్వళించిన, ముగుదయెవరు?

ముసుగుదీసినదా ముద్దు మోముమీద
ముగ్ధ యౌవన సౌందర్య మూర్తి యదుగొ
తెలిసె గోపాలదేవుని చిన్నరాణి
నవ్య సుకుమార సుందరి, నాతిసత్య

కోపమోలేక విరహంబు, గొనెనొగాని
వాడియున్నది నెమ్మోము, వదలెకురులు
రాలుచున్నవి కాటుకకనుల నుండి
బాష్పధారలు చెక్కుటద్దాలపైన

ప్రణయ కోపరసమిళిత, మైనముగ్ధ
లోచనంబులలోని యాలోచనేమో
యేమి సవ్వడి విన్నదో, యేమొకాని
యుస్సురంచును ముసిగిడె నువిద మరల.

అంతలోపల నల్లని వన్నెకాడు.
యడుగులోపల మెలమెల్ల నడుగు లిడుచు
వింతనొందుచు చిరునవ్వు వెల్లివిరియ
ముసుగు సడలించి ఒక్కింత మోమువంచి

చెదరిన నీలిముంగురులు
చెక్కులపై బడి మేలమాడగన్
గదలక నున్నయట్టి కరు
ణామయి మెల్లన గన్నులిప్పుమా.
ముదిరిన ప్రేమ భావనలు
ముప్పిరిగాగొని నా యెడందలో
వదలక నిండియుండె నిటు
వారిజలోచన లేచి గాంచుమా!

పారుజాతపు నెత్తావి, పైనిగ్రమ్మ
మధుర మంజుల సుధలొల్కు, మాటవినగ
తోక ద్రొక్కిన త్రాచుగా, దోసి ముసుగు,
లేచి యలుకను బ్రియుతోడ, నతివ బలికె

ఎవరు మీరలు! యధిపులా! యెంత చిత్రము
యెంతసేపాయె మీరిట కేగుదెంచి
ప్రణయ భాగేశ్వరీమీదు పడతిపీడి,
తప్పుదారిని బట్టిరా? ధాతలిపుడు.

పారిజాతపు పుష్పమా, భామకిచ్చి
వెక్కిరింపగ వచ్చిరా, వెఱ్ఱిదాని
పరిభవాగ్నిని గుండెలో బాదుగొల్పి
బ్రతికియున్నాను జీవంబు బాయలేక.

గొల్లపడుచుల గూడెడి గొప్పరాజ
యతుకునెట్టుల రసికత, నల్లమీకు
రాజ రమణుల మాధురీ ప్రణయభావ
రస విలాసంబులో దేల రాదుమీకు.

నల్లనివారి మాటలను
నమ్మగరాదను లోకసూక్తినే

డల్లన దెల్లమయ్యెనిక
నాథుడ యీ కపటంబు లెందుకో

వల్లవకాంత నీ మధుర
మంజుల సూక్తి కళా విలాసమున్

జెల్లగ నేరవింక దయ
చేయుము నీ ప్రియురాలి యొద్దకున్

నమ్మి జీవన సర్వస్వ మమ్ముకొన్న
నన్ను నిట్టుల జేతువే నగవుపాలు
బ్రతుకజాలను యీ పరాభవముతోడ
ప్రాణముల బాతు మీ పాద పద్మమందు.

అనుచు గద్గద కంఠియై, కంపమాన
హస్తములతోడ కాంతలల్లాడు కనులు
గప్పుకొని నేడ్చె నయ్యింతి, కాంతుముందు
గలతజెందిన కోయిల, కాంతవోలె

చెలియరో యింత మాత్రమున
కే యిటుల గుందగనేల నీ మదిన్
గలికి! ఒకప్పుడైన నిను
గాదన నేర్తునెప్పుడెంత! నా
బలమున గెల్చి దేవతతి,
బాగన నెల్లరు దెచ్చియిత్తు నీ
వలుకనుమాని జూడుమిటు
వామవిలోచన మందహాసమున్

పూలవనమందు పన్నీటి కొలను చెంత
చలువరాతిన్నెగడ పొన్న దరులమధ్య
పారిజాతపు చెట్టు నే బాతువాడ
నమ్ము నామాట నీ పాద మానసుమ్ము

సరస శృంగార మోహన చక్రవర్తి
చిలిపి నవ్వులు కెమ్మోవి జిందుచుండ
తప్పునైరించి కావుమా! సఖియ! యనుచు
పడతిపాదాల తన ఫాలతలము మోపె.

ముట్టకు చాలు! నాపదము
మోహపుదేవుల కాళ్ళు పట్టినన్
నెట్టన జెల్లుగాని సఖ
ఎంతటి దానను బాదమీడు నీ

మాటలకేమి పోదు మది
మక్కువ వేరొక చోటనుండగా
కోటమిజేసి మాటికిని
నా ప్రియ యేటికి కాలుదువ్వగన్

సత్యకా లందెమువ్వలు ఘల్లురనగ
ఖంగుమనె శౌరి కిరీట మణులు ధరను
ఝల్లుమని దేవు హృదయంబు( జలదరించె
ఫక్కుమని నవ్వె చిలుకతా పగిలిపడుచు

కలికురాలను మించిన, కఠినమైన
నా కిరీటంపు మణులకు దాకినీదు
నవ్య సుకుమార పాదంబు నాతినొచ్చె
ననుచు హస్తాన పాదాబ్జమంటె శౌరి

సోగ గన్నుల బాష్పాలు పొంగి పొరల
పాదమంటిన ప్రియనాథు పైకినెత్తి
యెంత కఠినంబు దాల్చితి పంతగించి
యెంత నొచ్చెనో మీ శిర మేమిసేతు.

ఎంతమైకము గల్గునో యెంచగలనె
కరుణజిందెడి మీ వాలు కనులయందు
ననుచు వివశత పారవశ్యంబునొంచి
వ్రాలె సత్య తా ప్రియనాథు వక్షమందు.



# సుజాత

శ్రీ కామఋషి సత్యనారాయణ వర్మ

రాజ్య భోగములను, తండ్రిని, భార్యా పుత్రాదులను తన కభిమాన పాత్రములైన వాటి నన్నింటినీ తృణ ప్రాయంగా విసర్జించి అర్ధరాత్రి సమయంలో సిద్ధార్థుడు కపిలవస్తు నగరాన్ని విడిచి వెళ్ళిపోయాడు. రాజలాంఛ నాలను విసర్జించాడు. తనచేతి కరవాలంతో శిరోజములు తెగగోసి రాగకారణములను నిర్మూలించు కొన్నాడు. భిక్షాటనా న్నవలంబించాడు. లోకంలోని నిఖిలజన దుఃఖ నివారణమే అతని పరమలక్ష్యం. సత్యాన్వేషణమే అతని పురోగమనం. సన్యాసుల శుశ్రూష – యోగాభ్యాస ములు–శాస్త్రార్థ చర్చలు అతని లక్ష్యసిద్ధి కనుకూలించ లేదు. ఉపవాస వ్రతములు, దీక్షలు గమ్యస్థానాన్ని చేర్చ లేకపోయినవి. శరీరం కృశిస్తున్న కొలది మనోదార్ఢ్యం సన్నగిల్లుతూంది. ఒకానొక వృక్షచ్ఛాయ నాశ్రయించి, ఆలోచనా నిమగ్నుడైనాడు. సువర్ణచ్ఛాయతో ప్రకాశి స్తున్న ఆ రాచబిడ్డ శిలా ప్రతిమలా ఆసీనుడైయున్నాడు పరిసరమందలి ఒక గ్రామీణ యువతి, సుజాత, పవిత్ర హృదయంతో చిన్నబిడ్డను చంకనెత్తుకొని పళ్ళెరములో పరమాన్నమును దెచ్చి సిద్ధార్థుని ముందుంచెను, ఆప్యా యంతో ఆ పదార్థము నారగించి తన క్షుద్బాధ నివారించు కొన్నాడు. "అమ్మా! అమృతోప మానమైన ఈ పదార్థ మేమిట"ని ప్రశ్నించాడు. "స్వామీ! నూరావుల పాలను ఏబది ఆవులకు పోశాను. ఏబదిఆవుల పాలను ఇరువది యైదు ఉత్తమ గోవులకు పోశాను. వాటి మధురమగు దుగ్ధములను దీసి పన్నెండు ధేనువులకు పోసి వాటిక్షీర ములను ఆరు మంచి కరియావులకూ గుడిపితిని. వాటి పాలనుదీసి రత్నాలవంటి రాజనాలతో ఉడికించి, సుగంధ ద్రవ్యాలువేసి ఈ పాయసం తయారుచేశాను. పుత్రదానం చేసిన వనదేవతవు నీవు నాకన్నులకు సాక్షాత్కరించిన దివ్యతేజస్సువు భగవాన్! నీకు ఉపాయనంగా తెచ్చేను. ఈపుత్రుడు మీ అనుగ్రహఫలం." అని బిడ్డను ముందుం చెను. తన అమృత హస్తాల నాబాలు శిరస్సుపైనుంచి "చిరంజీవ. సుఖీభవ! భారమైన ఈ జీవితం కుసుమ కోమలమై సుఖ ప్రదమగుగాక!" అని దీవించాడు. "అమ్మా! నీ హృదయ పాత్రికలోని పాయసం వలన జీవనదానం గ్రహించిన వ్యక్తి భగవంతుడుగాడు. అతడు నీ సోదరుడు. ఒకప్పుడు చక్రవర్తి బిడ్డ – ప్రాణికోటి యొక్క మనస్సులలోనిదుఃఖమును పారద్రోలుదివ్యజ్యోతి కొఱకు ఆరేళ్లనుండి రేయింబవళ్ళు అన్వేషిస్తున్నాడు. కృశీభూతమైన యీ తనువునకు ఏ అమృతాన్నం ఏఘడి యలో జీవనదానం చేసిందో అప్పుడే ఆ వెలుగు కన బడింది. ఈ జీవితం యొక్క శీఘ్ర గమనంలో పాప ప్రక్షాళనం గావించు కొంటూ నూత్న పథాల నధిగమించ డంలో అనేక జన్మ పరంపరలు గడచి పోయాయి? నిజంగా బ్రతుకులో మాధుర్యమున్నదా తల్లీ? జీవితాన్ని ప్రేమించడంలో సంతృప్తి కలుగుతుందా? అని దీనంగా ప్రశ్నించాడు సిద్ధార్థుడు.

"ఓ పూజ్యుడా! నా హృదయం అల్పమైనది. అల్ప మైన వర్షధార విశాల సుక్షేత్రాలను సస్యశ్యామలం చేయ లేకపోయినా, ఈచిన్ని పూదొన్నెను నింపగలదు కదూ! నా గృహాంగణాన్ని వసంత శోభతో నింపి, జీవితంలో అరుణోదయ కాంతులు ప్రసరిస్తాయని గ్రహించడానికి నా భర్త అనురాగమూ, ఈ చిన్నారిపాప చిరునవ్వులూ చాలవా? గృహ సంబంధమైన బాధ్యతలతో నిండిననాడు ప్రతి దినం ఆనందంగానే గడుస్తూంది. ఉషః కాలంలో లేచి భగవంతుని స్మరించుకొని, నా తులసికి నీరు పోసి సాయంసమయ మయ్యేవరకు గృహకృత్యాలలో నిమగ్న నౌతాను. దినాంతం కాగానే రజత దీపికలవలె నక్షత్రాలు వెలుగుతాయి. స్వర్గధామానికి చేయూత నిచ్చే మృదు హస్తాలు గల ఈ పుత్రోదయంతో మేమాశీర్వదింపబడిన తర్వాత ఆనందం పొందకుండా ఉండగలమా? పథికుల శ్రమదీర్చి నీడనిచ్చే చెట్లు పాతుట, నూతులు త్రవ్వుట, పుత్రుని బడయుట మరణానంతరం ఆముష్మిక సుఖానికి మూలమని పవిత్ర గ్రంథాలు ప్రబోధిస్తాయి. ఆ పవిత్ర గ్రంథములలో చెప్పినదేనాకు శిరోధార్యము. సత్కర్మ వల్ల మంచిన్నీ దుష్కర్మవల్ల చెడుగున్నూ సంభవమౌ తుందని నానమ్మిక. అందరకు ఇంతేగదా! చెడు తలం పులు ఏహ్యభావమును, కరుణ స్నేహమును, ఓరి

శాంతిని కలుగ జేస్తాయి అనంతమైన ఫలసాయం కలగ డానికి ఆదిలో నాటిన కొలది బీజములే కదా కారణం. చంపక ప్రసూనం యొక్క సువర్ణచ్ఛాయలు వసంతారం భంలో చెట్టుకుదొడిగిన పసరుమొగ్గలో దాగి ఉంటుంది! జీవితరంగంలో భరించవలసిన కష్టా లుంటాయని కూడా తెలియును. నా ఆశాజ్యోతి ఈచిన్నిబిడ్డ నాకంటెముందు మృత్యువు వాత బడితే నాహృదయం బ్రద్దలై నట్లు తోస్తుంది. పతివ్రతలు తమఅంతిమదివసం ఆసన్నమయ్యే వరకూ వేచిఉంటారు. పతివియోగమేప్రాప్తమైతే ఆ పవిత్ర చితాగ్నిలోకలసి నాపతి ననుసరిస్తాను. ఈఆత్మార్పణవల్ల భర్తకూ నిరవధికమైన స్వర్గ సుఖం లభిస్తుందని పవిత్ర గ్రంథాలలో వ్రాయబడిఉంది. అందువల్ల నాకూ ఈ ఆహూతి భయానకంగా తోచదు. బాధాగ్రస్తులనూ నిరుపేదలనూ, దుర్మార్గులనూ, దిక్కులేని వారినీ దేవతలు జాలిగా చూస్తారు కనుక వారిని మనం మరచుటలో వివేకంలేదు. వినయంతోనే నెరిగిన మంచిని ఆచరించుటకు ప్రయత్నిస్తాను. ఏ సంఘటన అడ్డు వచ్చినా సరే ధర్మం పట్ల విధేయతతో జీవిస్తాను. ఇదేనాజీవిత విధానం" అని అమాయికంగా ప్రవచించిందా సుజాత

"అమ్మా! ధర్మ మార్గము, విధినిర్వహణములను గూర్చిన నీ విజ్ఞానం పరిపూర్ణమైనది. కరుణామయము. మధురమునైన నీ విజ్ఞాన పుష్పాన్ని శాంతి పూతమైన ఛాయలలో ఎదుగనిమ్ము"

"నన్ను పూజింపవచ్చు. నా పూజలందుకొన్నావు. నాకు బోధకురాలవైనావు. మానవుడు ఆశాజీవి ఎలాగయ్యాడో నీలోదర్శిస్తున్నాను" అని ఆమెకు నమస్కరించి తన లక్ష్యసాధన కొకమార్గం గోచరించినట్లనుభూతిని పొంది చేరువనేగల బోధివృక్షాన్నాశ్రయించి సమాధిస్థితుడైనాడు. అమాయిక హృదయ సుజాత ధీరమనస్కయై చెప్పిన ప్రబోధమే సిద్ధార్థునకు దుఃఖ భూయిష్ఠమైన ప్రపంచమందలి తృష్ణా తమస్సులనుపారద్రోలు అఖండ జ్యోతిర్దర్శన మగుటకు ప్రథమ సోపానముగా పరిణమించినది.

నమోతస్స అర్యితో సమ్మాసం బుద్ధస్స

బుద్ధం శరణం గచ్ఛామి!

ధర్మం శరణం గచ్ఛామి!

సంఘం శరణం గచ్ఛామి!

(ఆర్నాల్డ్‌కు అనుసరణ)


బిడ్డల లివరు అండు స్ప్లీను వ్యాధులకు

పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్ప్లీను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. వైద్యవృత్తియందును నా స్నేహితులలోను బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుట కవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిదివరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడుచున్నాను. అమోఘముగ నిట్టి మహౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టరు ........................

వివరములకు:

డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు & బ్రదర్సు,

నెం. 19, దక్షిణమాడా వీధి, మైలాపూరు, మద్రాసు 4.

ఫోను: 71354

కుంభకోణం బ్రాంచి:

నెం. 7 సారంగపాణి కోవిల్

తూర్పు వీధి.

అన్ని మందుల షాపులలోను దొరకును.



# మనలో మనమాట

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

టక్ — టక్ — చుట్టుచెంగావి చీరచెంగులు దోపుకుంటూ వస్తూంది శేషమ్మత్త—మట్టెల ధ్వనితో—గృహాంగణములో ఆ మట్టెల సంగీతము, ఆ గాజుల తాళ మెంత మధురము !

శేషమ్మత్తకూ నాకూ మంచి స్నేహము. కారణము ఆమె నాకు ఎల్లమ్మ పుల్లమ్మ కబుర్ల గొడవ చెప్పకుండా తానెట్లా ముప్ఫయి నలభై ఏళ్లనుండి సంసార సాగరములో మునిగి పోకుండా జీవితనౌకను నడుపు కొస్తున్నదీ చెప్పుతూ, నా జీవితనౌకకు తెర చాప ఎప్పుడు ఎత్తాలో సలహా ఇస్తుంటే. ఫ్రీ ఎంటర్‌ప్రైజ్ మెంటుకు, ఫ్రీ అడ్వయిజుకు కృతజ్ఞురాలనై ఆమెకు తన జీవితనౌక చుక్కాని ఎట్లా తిప్పాలో నేర్పిస్తుండే దాన్ని.

ఇప్పటి తరము పైతరమునకుచెందిన దాన్ని నేను. నా తరము పైతరము శేషమ్మత్తది ఆమె మా తరము వాళ్లతో ఎట్లా సతమతమయిందో నాతో మొత్తుకుంటే నేను ఇప్పటి తరమువారితో, నా తికమకలు పోల్చుకుండే దాన్ని. ఇదే మన జీవన రహస్యము. ఎప్పుడూ మానవుడు — జీవి — పరిసర ప్రాంతములలో సరిగా ఇమడటానికి పోరాటము జరుపుతూనే వుంటాడు. ఏ దేశము లోనైనా, ఏ కాలము లోనైనా ఈ పోరాటము తప్పదు. ఈ పోరాటములో జయాపజయాలే జీవితము. ఆ జీవితపు ఒడుదుడుకులే జీవిత మాధుర్యము. ఈ మాధుర్యము చక్రకేళీ పండువంటిది కాదు. మామిడి పండువంటిది. పులుపుతో కూడిన మాధుర్యము. నిత్యము లభించేదిగాక వైశాఖ జ్యేష్ఠములలోనే లభించ గలదీను.

శేషమ్మత్త కూతుళ్ల పెండ్లిండ్లు చేసేటప్పుడు కట్నాల హడావిడి ఎక్కువగాలేదు. ఏదో తనకు శక్తి వున్నంతలో ఆడ పిల్లలకు పసుపు కుంకుమగా నాల్గేసి ఎకరాలు ఇచ్చిలది. పండుగకీ పబ్బానికీ తరుచూ వచ్చి పోయేటట్లు గానే దగ్గరే ఇచ్చినది. పెద్ద పిల్లకు పెండ్లయి ఇరవై ఏండ్లయినా ఇప్పటికీ ఆమెకు కావలసిన సారె చీరెలు ఆమే సప్లయి చేస్తూంది. వచ్చివెళ్లేటప్పుడు పప్పు వుప్పు, ఊరగాయలు, వొడియాలు మళ్లీ పండుగదాకా సరిపోయేవి తీసుకు పోతూనే వుంటుంది. పిల్లలకు. అన్నప్రాసన. నామకరణ, వివాహములలో మేనమామలు చేయించవలసిన వన్నీ శేషమ్మత్త ఏమీ బీరు పోకుండా చేయిస్తూనే వున్నది—కోడళ్లు సణుగు కుంటున్నా. కూతుళ్లు అసంతృప్తి పడుతున్నా. ఆడపిల్లలకిదేమి అన్యాయమని నేను పేచీ పెట్టినప్పుడల్లా, "తెనుగు నాట ఆడ పిల్లలకు ఏమి అన్యాయము జరిగిందమ్మా" అని ఆమె అడిగేది. అప్పటికి జవాబు చెప్పలేక నోరుమూసుకున్నా వీలున్నప్పుడల్లా నేనూ, నా తరము వారూ ఆడ పిల్లలకు అన్యాయము జరిగిందనే అంటూ వచ్చాము.

అందుకనే ఈ తరము వారు పేచీ పెట్టి ఆస్థులే తీసికుంటున్నారు. ఇప్పుడిక్కడా నాతరము వాళ్లకు అవస్థ. ఆస్థి భాగము ఆడపిల్లలు తీసికుంటుండిరి. కాని అల్లుళ్లు ఆడపిల్లల ఇండ్లకు రారుగా. రక్తము ధారపోసి పెద్దలు చేర్చికూర్చి పెట్టిన దానిని ముక్కలు ముక్కలు చేసి ఈ ఆడ పిల్లలు వాళ్ల కిష్టమొచ్చినట్లు ఈ ఆస్థిని ఉపయోగించి నష్టపరుస్తూ వుంటే చూచి వూరుకోలేక, వూరుకోకుండా వుండలేక సతమత మౌతుంటిమి. అంతేగాదు — ఆస్థి తీసికెళ్లినామని, మరి పుట్టింటి పనులన్నీ అత్తా రింటిలో జరుగు తున్నవా ? అటు కూతురికి సమాధానము చెప్పలేక. ఇటు కొడుకు దురవస్థ చూడలేక హతాశులమై పోతుంటే — ఆస్థి హక్కు వచ్చిందని సంబరపడే ఈ తరము అమ్మాయిల సంబరానికి మేము (మాతరము) చూచి నవ్వాలో ఏమిచెయ్యాలోతెలియక నివ్వెరపడుతూ వుంటే శేషమ్మత్తా ఆమె తరమువారూ ఎంతో తృప్తితో మీకంతే శాస్తిగావలెనంటూ సంతోషిస్తున్నారు.

మనలో మనమాట — ముందు నుయ్యి వెనుకగొయ్యి— పైతరము వారితో పేచీ పడదామా. క్రింద తరము వారిపై కినుక బూను దామా ?

# పరమేశం ప్లాను

కుమారి జంధ్యాల రాధ

బ్రహ్మానందపురంలో పరమేశం అనే అతను ఉండేవాడు. అతడికి ఓసారి జబ్బుచేసింది. చాలా ఖర్చయింది. చాలా బాధ పడ్డాడు. పెద్దజబ్బు. మృత్యువుతో హోరాహోరీ పోట్లాడాడనేచెప్పాలి. పోట్లాటకు వెళ్ళిన వాడు చెయ్యో. కాలో. చెవో.ముక్కో ఆఖరుకి వేలో.విరక్కొట్టుకోకుండారాడు వాడు జయించినా. అట్లే పరమేశంకూడా మృత్యువుతో పోరాడి ఆఖరుకు విజయంపొందాడు. ఆ జబ్బు నయమయ్యే వేళకు అతనికి బండచెముడు సంప్రాప్తించింది. అప్పట్నుంచీ పరమేశం చింతతో స్నేహితుల్నీ ఎవర్నీ పలుకరించే వాడుకాదు. వారిదగ్గరకు కూడా వెళ్ళేవాడు కాడు. వాళ్ళతో మాటాడాలంటే తను చెవిటి వాణ్ణని సిగ్గుపడేవాడు. ఇట్లాగే కొద్దిరోజులు గడిచాయి. ఇంతవరకు పరమేశం జీవితం ఎట్లాగో వెళ్ళుబుచ్చాడు. బాగానే వుంది. కాని, ఓ రోజు హఠాత్తుగా అతడి ఆప్తమిత్రుడి వద్దనించి అర్జంటుగా రావాలనీ, చాలా జబ్బుగావుందనీ ఉత్తరం వచ్చింది పరమేశానికి గట్టిచిక్కేవచ్చింది. అతడా చిన్న నాటి స్నేహితుడు. ఇద్దరూ ఎంతో కలిసి మెలిసి వుండేవారు. పరమేశానికికూడా ఎన్నాళ్ళనుంచో స్నేహితుణ్ణి చూడాలని ఉబలాటంగా వుంది ఇప్పుడు. రమ్మనికూడా రాశాడు. కాని తన చెముడు సంగతి గుర్తుకొచ్చి కుంగిపోయాడు. తనకు చెము డుందని స్నేహితుడు కనుక్కోకుండావుండాలి. అందుకో మంచి ఉపాయ మాలోచించాలి. ఇదే అతడి ఆలోచన. ఆరోజు రాత్రిపక్కమీద పడుకుని బాగా ఆలోచించాడు పరమేశం. తెల్లారితే ప్రయాణమవ్వాలి స్నేహితుడు సుబ్బారావుకు తను చెవిటివాణ్ణని తెలియ రాదు. అసలు సుబ్బారావుకు ఆ అనుమానమే రాకుండా వుండాలి.అందుకో ప్లాను తయారుచేయాలి.ఆలోచించి. ఆలోచించి బుర్రవేడెక్కాక పరమేశం మొహం చాటంతై వింతగా మెరిసింది. సంతోషంగా గూట్లోవున్న. చార్మినార్ పెట్టెలోంచి ఓ సిగరెట్ తీసివెలిగించాడు. పరమేశం బుర్రహుషారెక్కింది.

ఈ వుపాయంతో స్నేహితుణ్ణిచూచి రావచ్చు తను చెవిటి వాడని తెలియనూ తెలియదు. అపాయంలో ఆదుకున్నాడబ్బా పరమేశంఅన్న పేరూ సంపాదించుకోవచ్చు. మొదట వెళ్తూనే జబ్బు గురించి అడిగితే ఇక సుబ్బారావుకు వేరే విషయం మాటాడ్డానికి అవకాశం వుండదు. అందుకని తనువెళ్తూనే ఏమనడిగితే ఏమేంజవాబు లొస్తాయి. మళ్ళీ వాటికి ఏవిధంగా సమాధానాలు చెప్పాలి? అని ఆలోచించుకుని ఓ పథకం తయారుచేశాడు.

వెళ్ళగానే " జబ్బెట్లా వుంది " ? అనడిగితే వాడు (సుబ్బారావు)సంతోషంగా " నిన్నుచూడగానే నాకు సగం జబ్బు కుదిరినట్టుంది. ఇపుడుధైర్యమొచ్చింది " అంటాడు. అపుడు తను మళ్ళా " అంతే కావాల్సింది. అంతా ఆ భగవంతుడి దయ " అనాలి తర్వాత " మందేంపుచ్చుకుంటున్నావ్ ? " అని అడిగితే ఏదో ఓ ఔషధంపేరు చెబుతాడు. తను " భేష్! అది చాలా మంచి టానిక్కు. నీకు సత్తువ రావాలంటే అది దివ్యౌషధం " అనాలి. మళ్ళా " డాక్టరెవరు. ఇంటికే వస్తాడా ?" అని అడిగితే ఏదో ఓ వైద్యుడి పేరుచెబుతాడు. దానికి తను " ఆఁ అతడా? చాలా మంచి నిపుణుడు. నీ రోగం అతడే కుదర్చాలి " అనాలి. తర్వాత ఇహ అక్కడ వుండకుండా అర్జంటు పనులుఉన్నాయి అని చెప్పివచ్చేస్తేసరి. ఒక వేళ అంతగా బలవంతంచేస్తే ఇట్లాంటిదే ఇంకో ప్లాన్ తయారుచేసుకోలేక పోతానా ? అనుకున్నాడు. మనస్సులో. సిగరెట్ పీక అవతల్కి పారేసి పడుకొని హాయిగా నిద్రపొయ్యాడు.

పొద్దున్నే స్నేహితుడి వూరికి ప్రయాణ మయ్యాడు. పరమేశందురదృష్టమో, అతడిస్నేహితుడి దురదృష్టమో మరి పరమేశం వెళ్ళేటప్పటికి సుబ్బారావుకు వ్యాధి తగ్గటానికి బదులు ఇంకా కొంచెం ఎక్కువైంది.

మంచం పక్కన ఇంకా ఓముగ్గురు స్నేహితులు విచారంగా కూచుని వున్నారు. పరమేశం సుబ్బారావు మంచం మీద ఓ పక్క కూర్చుని కొంతసేపటికి మృదువుగా "జబ్బేమన్నా నయమేనా ?" అనడిగాడు. సుబ్బారావు విచారంగా "అయ్యో రామ! నా అవస్థ ఆ దేముడికే తెలియాలి. ప్రాణంపొయ్యేట్టుంది " అన్నాడు ఆయాసంగా మూల్గుతూ. పరమేశం పాపం ఏమీ వినపడకపోగా స్నేహితుడు కాస్సేపే మాట్లాడిబట్టి తనువూహించిన

సమాధానమే వచ్చిందనితలచి "అంతే కావల్సింది. అంతా ఆ భగవంతుడిదయవల్ల అల్లాగేజరుగుతేమేలే" అన్నాడు. అక్కడున్న "ముగ్గురు" దీనికిచాలా ఆశ్చర్య పోయారు. సుబ్బారావు లోపలనే గుర్రుమన్నాడు. ఏమిటబ్బా ఇదిఅని. మళ్ళా పరమేశం "మందేంపుచ్చు కొంటున్నావ్ ?" అనడిగాడు.

స్నేహితుడు కోపంతో "ఏదో విషం" అన్నాడు. పరమేశం తనప్లాను ప్రకారం "భేష్ ! అదినీకుతగ్గమందు. నీకుమంచిసత్తువ రావాలంటే అది దివ్యౌషధము అన్నాడు. ఈమాటు రోగికి కోపమొచ్చి వీడికేమన్నా పిచ్చెక్కిందా లేక నన్ను ఎగతాళి పట్టిస్తున్నాడా అనుకున్నాడు.

కాని పరమేశం ఇవేవీ గుర్తించలేదు. మామూలు తన ధోరణిలో తనుఊహించిన విధంగానే నడుస్తోంది వ్యవహారం అనుకొన్నాడు. "డాక్టరెవరు? ఇంటికెపుడొస్తాడు?" అనడిగాడు. సుబ్బారావు విసుగుతో "డాక్టరా ? యముడు. ఎప్పుడొస్తాడో ఏమో" అన్నాడు. పరమేశం వెంటనే "ఆ! ఆయనా? మంచివాడునీకు కుదర్చటానికిఅతడయితేనే సరిపోతుంది" అనేశాడు. ఆమాటలు పూర్తవుతూండగానే రోగిమొహం కోపంతో మండిపోయింది. అంతబలంలేని వాడుకూడా పరమేశం మాటలు వింటూనే కోపంకొద్దీ కాలు ఝూడించి ఎగిరి తన్నేవేళకు పరమేశం చంకలో చేతిసంచీతో సహా బుడ బుడ దొర్లుతూ మేడ మీదనుంచి కింద వీధి వాకిట్లోపడి వళ్లు దులుపుకొని లేచి ఏదీ అర్థంగాక తిన్నగా రైలు స్టేషను వైపు దారి తీశాడు.

పరమేశం ప్లానువలె మీరు ఏదన్నా వేసేరు భద్రం. జాగ్రతోం జాగ్రత:

---


# గ్రైప్ సిరప్-ఐ.టి.యల్

చంటిబిడ్డల అజీర్ణ వ్యాధుల నివారణకు ప్రసిద్ధమైనది. వెంటనే గుణము కలిగించును.



సదా ఉపయోగించినను అపాయము లేదు




ఒక ఐ.టి.యల్. ఉత్పన్నము




పిల్లలు దీనినే కోరుతారు

తయారీ:
ది మైసూరు ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబొరేటరీ లిమిటెడ్, మల్లేశ్వరము, బెంగుళూరు - 3
విక్రయ స్థలము: 35/37 తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు - 1

MITZ-7TG




దున్నని వానికిఁ బొల మెం
తునున్న ఫలితమ్మొకింత నొందఁడు ; దానిన్
అన్నువ వెల కల్పించిన
దున్నంగల వాని బ్రతుకు దొరలును సుమతీ !

భూసంస్కరణ విధానము
కోసము సోమరులు మిగులఁగులుకుదు రకటా !
గాసింజెందని వారికి
గ్రాసము లభియించు నెంత కాలము ? సుమతీ !

పాపము ! భూస్వాములకే
శాపము వాటిలెనొ ! వారి క్ష్మాస్థలి తగ్గున్
దాఁపఱికపు విత్తమ్మే
రూపమ్మున భంగ మంది క్రుంగునొ ! సుమతీ !

భూదాన యజ్ఞమువనే
బీదతకున్ ధనికులకును బ్రీతి జనించున్
గాదె " వినోబా "కతమున ?
వాదమ్ము హరింప నదియె పద్ధతి సుమతీ !

రైతునకుఁ గూలివానికిఁ
బ్రీతిం గల్గించు నీతి రీతిం దెలుపన్
నేతలుతమ చట్టములు
ఖ్యాతిగ సమకూర్ప మేలు గల్గును సుమతీ !

ఆచరణ యోగ్య కార్యము
సూచింపక యిచ్చ వచ్చు సుద్దులు పలుకన్
" ఛీ-ఛా " అనరే లోకులు ?
పేచీల్ గల శాసనమ్ము వ్యథరా సుమతీ !

చట్టము చట్టు గనెప్పుడు
నెట్టులు నిలుచుండు ? జనుల యిచ్చ కొలందిన్
గట్టిపడు-సడలు-క్రుంగును
గుట్టెఱుఁగక రట్టు పెట్టఁగూడునె ? సుమతీ !

చట్టముచే అవినీతిన్
గిట్టింపఁగ నెన్ని యేండ్లొ నిండుట నిజమే
గుట్టు బయ ల్పెట్టుటకై
గట్టి ప్రచార మ్మొనర్పఁగావలె సుమతీ !

కొంచెపుఁబనిఁదొలఁగింపఁగ
నుంచిన యుద్యోగి దాని కొడఁబడు నేనిన్
వంచన దెలియఁగ వశమా ?
కంచెయె చేన్మేయ నెవఁడు కన్గొను ? సుమతీ !

కులతత్త్వ ధోరణిం బడి
పలికెడి యుద్యోగి భంగపా టొందఁడొకో !
తెలిసి ప్రజా స్వామ్యమ్మును
పలుపుర నొకటిగఁ దలంప వలయును సుమతీ !

---



—ఇతిహాస మంజరి.





# గృధ్ర జంబుకోపాఖ్యానము

'సుభాషిణి'

ఆర్తజనుల బాధలు తొలగించి వారిని రక్షించ వలసిన బాధ్యత ప్రభువుపైన ఉన్నదనిన్నీ, స్వప్రయోజనం కోసం కపటమనస్కుల మాటల లోని నిజ స్వభావం తెలుసుకునే విజ్ఞత ప్రభువైన వాని కర్తవ్యమనిన్నీ తెలియజేయడానికి భీష్ముడు ధర్మరాజుతో ఈ క్రింది కథ చెప్పాడు.

ఒకానొకప్పుడు, విదిశా పట్టణంలో ఒక బాలుడు చనిపోయాడు. ఆ శిశువుకు కావలసిన వారంతా ఆ బాలుని శవాన్ని శ్మశానానికి తీసుకుపోయి బాలుని కోసం ఎంతగానో దుఃఖించడం మొదలు పెట్టారు. చిన్న పిల్లవాని మరణం బంధువులందర్నీ శోకంలో ముంచి వివశాత్ములనుగా చేసింది. అందరూ పెద్దగా ఏడవడం మొదలు పెట్టారు. ఇలా ఉండగా ఇది అక్కడ ఉన్న ఒక గ్రద్ద చూచింది. వారి దగ్గరకు వచ్చి ఆ గ్రద్ద వారిని సంబోధించి

"ఏమిటిది? ఇక్కడ కూర్చుని ఏడుస్తున్నారు? మీ కేమీ భయం లేదా? ఇక్కడ ఏడవ కూడదు. ప్రొద్దుపోతూ ఉంది. సూర్యుడు త్వరలోనే అస్తమించబోతున్నాడు. ప్రొద్దు క్రుంకిందంటే ఈ శ్మశానంలోనికి భూతాలూ, పిశాచాలూ వచ్చి తాండవం చేస్తాయి. మిమ్మల్నందరినీకూడా అవి చంపి తింటాయి. పుట్టడమూ, చావడమూ క్రొత్త వింత కాదుగదా! ఆ శిశువు ఏలాగూ చచ్చిపోయాడు. వానితో పాటు మీరుకూడా చావాలని ఉందా? శవాన్ని అక్కడ విడిచి వెంటనే పారిపొండి" అని చెప్పింది.

గ్రద్ద ఇంకా "చచ్చిపోయిన వాళ్ళు, ఏడిస్తే తిరిగి వస్తారా? మీకు మతులు పోయాయా ఏమిటి? ఇంక ఏడుపులు చాలించండి. ఆలస్యం చేస్తే మీ ప్రాణాలు కూడా దక్కవు. వెంటనే తిరిగి పొండి" అని చెప్పింది.

బంధువులంతా ఈ మాటలు విన్నారు. అవు నవును నిజమే అనుకున్నారు. తక్షణం వెళ్ళి పోవడమే తమ కర్తవ్యం అని భావించారు. గ్రద్ద మాటలు వారి నెంతగానో భయపెట్టేశాయి. శవాన్ని అక్కడే విడిచిపెట్టి అందరూ వెళ్ళి పోవడానికి లేచారు.

ఇదంతా ఒక నక్క తన కన్నంలో నుంచి చూస్తూ ఉండి, వెలుపలికి వచ్చి వారి దగ్గరకి వెళ్ళింది. వారితో "ఏమిటయ్యా మీరు బొత్తిగా అమాయకుల్లాగు కనపడుతున్నారే! ఆ గ్రద్ద చెప్పడమూ, మీరు భయపడడమూనా? ఇంత చిన్న పిల్లవాణ్ణి విడిచిపెట్టి పోవడానికి మీకు కాళ్ళెలా ఆడుతున్నాయి. మంచిపని చేస్తున్నారు! మీ శోకం అంతా పోయేలాగు ఏడవండి. ఇక్కడే కొంతసేపు ఉండి ఏడ్చినట్టయితే, దైవం అనుగ్రహిస్తే, ఈ బాలునికి తిరిగి ప్రాణాలు రాకుండా ఉంటాయా! ఈ మాత్రం తెలుసుకోలేమి? మీరు గట్టిగా ఏడిస్తే సూర్యుడు కూడా అస్తమించడానికి భయపడతాడే! మీ కెందు కింత భయం! వెళ్ళిపోక, నిలవండి. మీ బాధ అంతా తీరి పోయేలాగు దుఃఖించండి!" అని చివాట్లు పెట్టింది.

ఈ మాటలు వినడంతోనే వారికికూడా ఆశ పుట్టింది. ఏమో! మళ్ళీ బ్రతుకుతాడేమో అని తిరిగి వచ్చి కూర్చుండి ఏడవడం ప్రారంభించారు ఆ బాలుని బంధువులంతా.

ఇది కనిపెడుతూ ఉన్న గ్రద్ద మళ్ళీ వాళ్ళ దగ్గరకు వచ్చి ఈ మతి మాలిన నక్కమాటలు నమ్ముతున్నారా! ఎంత ఘోరం. పీనుగు ఎప్పుడో కొరడు బారి వికృతం అయిపోయింది. ప్రాణాలు ఇంకావస్తాయా? యముడంటే ఏమను కొంటున్నారో! మహా క్రూరుడు. మీరు ఏడ్చినకొలదీ బిగిసిపోతాడు. ఇంక ఈ ఆశలన్నీ కట్టిపెట్టండి. దానాలూ, ధర్మాలూ ఇచ్చి పిల్లవానికి మంచి గతులు ప్రాప్తించేలాగు చేసు కోండి. అంతేకాని ఏడ్చి, ఇక్కడ కాలం వృథా పుచ్చకండి!" అన్నది.

గ్రద్ద మాటలు విని జంబుకానికి ఒళ్ళు మండింది. "ఛీఛీ! ఈ గ్రద్ద చాలా క్రూరమైనది. ఈ సుకుమారుని విడిచిపెట్టి పొమ్మనడం ఎంత దయమాలిన పని! ఇతని సౌందర్యం చూస్తూ ఉండకుండా విడిచిపెట్టి పోవడానికి మీ మనసెలా ఒప్పింది. నాలాంటి జంతువుకి కూడా కళ్ళవెంట నిలవకుండా కన్నీరు కారి పోతూ వుందే! మీరు ఎంత దయమాలిన వాళ్ళు! ఎందుకు పోతారు? ప్రయత్నం చేసి మీరు అంతా భగవంతుణ్ణి కలిసి ప్రార్థిస్తే తప్ప కుండా ప్రాణం వస్తుంది. బ్రతుకుతాడు. ఒక వేళ బ్రతకడే అనుకోండి. మీరు అలా చెయ్యడంవల్ల నష్టమేముంది? అప్పుడే తిరిగి వెళ్ళండి. ఇంత నిర్దయ తగదు" అని గట్టిగా చెప్పింది.

ఈ మాటలన్నీ గ్రద్ద విని ఇలా అంది. "నేను పుట్టి పన్నెండు వందల ఏళ్ళో పదమూడు వందల ఏళ్లో అయింది. ఇంతకాలమూ చచ్చిన వాడెవడైనా సరే, బాలుడు కానీ, యువకుడు కానీ, వృద్ధుడుకానీ చచ్చిన తరవాత తిరిగి బ్రతకడం నేను ఎప్పుడూ చూడలేదు- వినలేదు కూడా. అయితే ఒకటి మాత్రం ఉంది. చని పోయిన వాళ్ళు వేరే గర్భంలో పుడతారు అనడం. అంతేకాని ఇదేమిటి? ఈ టక్కరి నక్కకు ఎక్కడి బుద్ధి ఇది. చచ్చినవాడు మళ్ళీ బ్రతకడమా! ఎవరైనా వింటే నవ్విపోగలరు" అని ఆక్షేపించింది.

వాళ్ళకి పూర్తిగా నమ్మకం ఎగిరిపోయింది. బిడ్డను అక్కడే విడిచిపెట్టి వెంటనే వెళ్ళిపోడానికి తిరిగి పొయ్యారు. నక్క ఆ పోయే వాళ్ళ కాళ్ళకి అడ్డం వెళ్ళి "అయ్యో పిరికివాళ్ళల్లారా! వినండి నా మాటలు ఆఖరుసారి చెపుతున్నా. చచ్చిపోయి ఎంతమంది బ్రతకలేదు? చచ్చిన బ్రాహ్మణ కుమారుణ్ణి శ్రీరామచంద్రమూర్తి బ్రతికించలేదా? సృంజయుడి కొడుకైన సువర్ణష్ఠీవిని నారద మహర్షి ఎన్నిసార్లు బ్రతికించలేదు! అయ్యో వెర్రివాళ్ళల్లారా! అలాగే ఎవరో ఒక మునో, మహాఋషో, సిద్ధపురుషుడో మీ ఘోష విని, దయపుట్టి బిడ్డకి ప్రాణాలు ఇవ్వవచ్చు కదా! దానివల్ల ఎంత మేలు కలుగుతుంది మీక్కు! ఎందుకూ మీకీ భీతి? వెళ్ళకండి" అని తీవ్రంగా చెప్పేసరికి వాళ్ళు తిరిగి వచ్చి, ఆ శవంచుట్టూ చేరి గట్టిగా మళ్ళీ మళ్ళీ ఏడవసాగేరు. ఇంతలో ప్రొద్దు పోయింది.

శ్రీరామ చంద్రుడు పరిపాలిస్తున్న రోజులలో రాజ్యం అంతా సుభిక్షంగా ఉంది.

వర్షాలు సకాలంలో కురిసేవి. పంటలు మూడు కారులలోనూ పండేవి. అకాలమరణాలు లేవు. వ్యాధిపీడితులు కానరారు. జార చోర భయాలు లేవు. ధన ధాన్య సంపత్సమృద్ధితో తులతూగుతూ ఉండేది.

అలాంటి సమయంలో ఒక వృద్ధ బ్రాహ్మణ దంపతులు శ్రీరాముని కొలువు కూటంలోకి వచ్చారు. తమ చిన్ని కుమారుడు చనిపోయాడు. చేతులలోని ఆ బాలుని కళేబరాన్ని శ్రీరాముని ముందు బెట్టి "రాజా! నీ రాజ్యంలో అకాల మరణాలా? ఈ చిన్ని నిసుగు మరణించుటా? ఇలాంటి అక్రమమూ, అన్యాయమూ నీ రామరాజ్యంలో కూడ జరుగుట ఆశ్చర్యంగా ఉంది. ఈ పసిబాలుడు మరణించాడంటే నీ రాజ్యంలో ఏదో లోపం ఉన్నదన్నమాట. ఇతని ప్రాణాలు తిరిగి ఇచ్చి మా బాలుని మాకు ఇయ్యి!'' అని పదే పదే విలపించారు.

శ్రీరామచంద్రుడు ఆలోచించి శంబుకుడను వాని దుశ్చర్య ఇందుకు కారణమని తెలుసుకుని వానిని వధించాడు. ఇంద్రుడూ మొదలైన దేవతలంతా రాముణ్ణి ప్రస్తుతించి వరము వేడుకొమ్మన్నారు. రాముడు ఆ బ్రాహ్మణ కుమారుణ్ణి బ్రతికించమని కోరుకున్నాడు. ఆ కుమారునికి ప్రాణం వచ్చింది.

సృంజయుడనే రాజు అనేక తపస్సులు చేసి నారద మహర్షి అనుగ్రహంవల్ల ఒక కుమారుణ్ణి కన్నాడు. ఆ కుమారుని మూత్రమూ, పురీషమూ, స్వేదమూ, నిష్ఠీవనమూ కూడా బంగారము కావాలని కోరుకున్నాడు. అందుకు అతనికి సువర్ణష్ఠీవి అని పేరు పెట్టారు. సృంజయుని ఇంట్లో రోజు రోజుకీ బంగారం కుప్పలు కుప్పలుగా పెరిగిపోతూ వచ్చింది. ఇలా ఉండగా కొందరు దుర్మార్గులు ఈ సువర్ణష్ఠీవిని పట్టుకుని వాని శరీరంలో బంగారం ఉంటుందని తలచి చంపి చీల్చేశారు. సృంజయుడు కుమారునికోసం అపారమైన దుఃఖంతో ఏడ్చి ఏడ్చి నారదుణ్ణి తలుచుకొని ప్రార్థించాడు. నారదుడు అతన్ని బ్రతికించి మళ్ళీ తెచ్చి ఇచ్చాడు.

తనకంటె గొప్ప వాడై పోతాడేమో ననే భయంతో ఇంద్రుడే సువర్ణష్ఠీవిని చంపాడొకసారి. అప్పుడు కూడా సృంజయుడు ఏడ్చి ఏడ్చి నారదుణ్ణి ప్రార్థిస్తే తిరిగి అతణ్ణి బ్రతికించాడాయన. సువర్ణష్ఠీవి చాలా కాలం రాజ్యం పాలించాడు.

అలాగే ఏడవగా ఏడవగా ఏ కరుణామయు డైనా అక్కడికి వచ్చి వాళ్ళ దుఃఖం చూచి దయదలచి ఆ పిల్లవానిని బ్రతికించకూడదా అని నక్క వాదన.

ఈ గ్రద్దా, ఈ జంబుకమూ ఎందుకు ఇంతగా వాదోప వాదాలు చేసుకుని ఎవరికోసమూ శ్రమపడడం? అసలు సంగతి అవి రెండూకూడా చాలా ఆకలితో ఉన్నాయి. ఈ పిల్లవాని కళే బరం తనకే దక్కాలని గ్రద్దా, తానే దక్కించు కోవాలని నక్కా స్వార్థపరత్వంతో ఎంతో నేర్పుతో మాట్లాడాయి. ప్రొద్దు క్రుంకిన ట్లయితే గ్రద్ద అక్కడ ఉండలేదు. అందుచేత వెలుగు ఉండగానే ఆ పిల్లవాణ్ణి విడిచి వెళ్ళి నట్లయితే తాను ఆ శవాన్ని తినవచ్చు. అందుకు పిల్లవానిని విడిచిపెట్టి వెంటనే పోవడం మంచిదని గ్రద్ద చెప్పింది. ఇంక నక్క. రాత్రి అయితేనే దానికి వీలు. అందుచేత ఆ శవాన్ని వాళ్ళు విడిచి పెట్టి పోతే, గ్రద్దపాలు కాకుండా చేసి రాత్రిలో తాను సుఖంగా భక్షించవచ్చుగదా అని నక్క ఆలోచన. అందుకు తగినట్టు అది మాట్లాడింది. ఎవరి స్వార్థానికి తగినట్టు వాళ్ళు మాట్లాడారు.

కాని అప్పుడొక గొప్ప చిత్రం జరిగింది. రాత్రి అయింది. కాబట్టి స్మశానంలో విహారం చేయడానికి శంకరుడు అక్కడికి వచ్చాడు. పెద్ద ఎలుగుతో గొల్లు గొల్లున ఏడ్చేవాళ్ళని చూచాడు. అతని మనస్సులో కరుణ ఆవహిం చింది. వాళ్ళకి ప్రత్యక్షం అయి ఏమి కావాలో కోరుకొమ్మన్నాడు.

వాళ్ళ ఆశ్చర్యానికి మేరలేదు. సంతోషంతో, భక్తితో భూమిమీద సాష్టాంగంగా పడి నమ స్కరించారు. "పార్వతీ ప్రియా! చంద్రధరా! దయాహృదయా! బాల మరణ శోకంలోనుంచి మమ్మల్ని తప్పించు మహాప్రభూ!" అని ప్రార్థించారు.

శివుడు అతన్ని బ్రతికించి వాడు నూరేళ్ళు బ్రతుకుతాడని ఆశీర్వదించాడు. గ్రద్దకీ, నక్కకి కూడా ఎప్పుడూ ఆకలిలేకుండా ఉండాలని కూడా వరం ఇచ్చాడు.

బంధువు లందరి హృదయాలూ ఆనందంతో నిండిపోయాయి. శిశువును ఎత్తుకుని, మాటి మాటికీ వానిని చూస్తూ, కౌగలించుకుంటూ, ముద్దుపెట్టుకుంటూ స్వగృహానికి వెళ్ళిపోయారు. గృధ్రమూ, జంబుకమూ కూడా తమ కులంలో శ్రేష్ఠమైనవిగా గౌరవింపబడుతూ వచ్చాయి.

"ఆర్తజనబాష్పప్రమార్జనంబు ప్రభువునకు కర్తవ్యం బనుటకును, నిజకార్యార్థులగు కపటుల నేర్పుమాటల తెరువెరింగి కొనుటకును ఉదా హరణమైన ఈ గృధ్ర జంబుకోపాఖ్యానము

వినిన, పఠించిన, వ్రాసిన
కొనియాడిన దురితపీడకుం దొలగి నరుం
డనుపమ ధర్మములకు భా
జనమగు నాయుఃప్రవృద్ధి సంపద నొందున్."

# భి క్షు కి

మూలం :
శ్రీమతి ఉషాదేవి మిత్రా

స్వేచ్ఛానువాదం :
జి. వి. యల్. నరసింహారావు

'నా' అనుకునేందు కామెకీ విశాల ప్రపంచంలో మిగిలిందల్లా ఆ ముగ్గురు పసికందులు మాత్రమే. పట్టణానికి వెలుపల నామ మాత్రంగా నిలిచిఉన్న ఆ జీర్ణకుటీరంలో సుఖదుఃఖాలను దిగమ్రింగుతూ దినావశేషంనిర్వికారంగా గడపుతూంటుందామె. ఆమెతోపాటు ఆమెను చుట్టుకునే మండువేసవిలో అగ్నిపర్వతపు భుగభుగలు, నిండు వర్షాకాలంలో ప్రళయకాల ఝంఝూ మారుతాలు ఆ జీర్ణకుటీరంలో నిరాఘాటంగా ప్రవేశించి తాండవిస్తుంటాయ్. శీతాకాలపు చలిచూపే మిడిసిపాటు సరేసరి హిమవత్పర్వతపు మంచుగడ్డలా 'జిమ్మ' ని పిస్తూంటుంది. అయినా ఆమె అలాగే ప్రతిరాత్రి తన బిడ్డలను హృదయానికి హత్తుకుని మరుసటి దినపు తేజోమయ ఉషః కాంతుల కోసం ప్రతీక్షిస్తూ కూర్చుంటుంది. ఎండి మొరడు వారిన ఆమె జీవితంలో ఏమయినా, లవలేశమయినా ఆశ మిగిలి వుందంటే అదే...మరుసటి దినోదయంకోసం ప్రతీక్షించడమే! పచ్చని జీవితమంతా భగ్గుమని, ఆ బయలు నందలి ఫల, పుష్పభరిత, ఆశా వృక్షాలన్నీ మొదలంటా కూలిపోయి సర్వనాశనం జరిగాక భవిష్యత్తుపై విశ్వాసం సన్నగిల్లి యాంత్రికంగా జీవించడానికి అలవాటు బడ్డ ఆమె నేటి నవనాగరిక సమాజపు చిట్టాలో హీనులపట్టీ క్రింద అట్టడుగున ప్రత్యేకంగా కనుపించే యువతి ఒక భిక్షుకి.

ఇక్ష్వాకులనాటి చింకి జోలెను చంకను తగిలించుకుని ప్రొద్దున్నుంచీ సాయంత్రం చీకటి పడేవరకూ—దినమెల్లా ఎక్కే గుమ్మం ఎక్కుతూ, దిగే గుమ్మం దిగుతూ ఆ భిక్షుకి కాళ్ళీడ్చుకుంటూ ఊరంతా తిరుగుతూనే ఉంటుంది దయకలిగిన పుణ్యాత్ములు పిడికెడు 'బిచ్చం' పెడతారు.

భిక్షుకి యిల్లు యిల్లూ. తిరిగి బిచ్చ మెత్తుతూంటే అన్నెమూ, పున్నెమూ ఎరుగని ఆ పసిబిడ్డలు చీకుచింతా లేకుండా బజారుల్లోబడి ఆడుకుంటూంటారు. సాయంత్రం కాగానే నకనకలాడే ఆకలితో బిక్కు బిక్కు మంటూ తమ చుట్టు అలముకుంటూన్న చిమ్మ చీకటిలోనే 'అమ్మ' కోసం కళ్ళతో వెదుకుతూ ఆ గుమ్మంలోనే 'అమ్మ' కోసం ఎదురు తెన్నులు చూస్తూ పిల్లలు ముగ్గురూ కూర్చుంటారు ఆ సమయాల్లో ఆ పసికందుల లేలేత హృదయాల్లో ఎట్టి అనుభూతులు కలుగుతూంటాయో, వారి ఆలోచనలు ఎలా ఉంటాయో ఎవరు చెప్పగలరు? ఆ అంధకారంలో అమ్మకోసం కేవలం ఆ ముగ్గురు పిల్లలు మాత్రమే భయంతోనూ ఆశతోనూ ఎదురు చూస్తూంటారు.

దేశమంతటా కరువు రాక్షసి శరవేగంతో విజృంభిస్తోంది. అందుకనే కొన్ని రోజులుగా 'భిక్షుకి'కి సరిపడే బిచ్చమే దొరకడం లేదు. ఇన్నాళ్ళనుండి తినీ తినకుండా ఆమె అలాగే గడుపుతూ వస్తూంది. పిల్లలు చిక్కి శల్యమై పోయారు. చిన్నవాడికి ఒళ్ళు తెలియకుండా ఉంది ఇంకా కాసేపో — కాసేపో అంటున్నాడు. మాటాలేదు పలుకూలేదు. వాడిబాధ యమబాధగా ఉంది. పసివాడు ఒంటరిగా మృత్యువుతో పెనుగులాడుతున్నాడు. అయినా ఆమె యిల్లు కదిలి భిక్షకురాక తప్పలేదు. రెండు రోజులుగా తాను అలాగేఉండి పిల్లలకు కాస్త కాస్త మూతి చెయ్యి, ఎంగిలి చెయ్యగలుగుతోంది; యివాళ అదీలేదు. ప్రొద్దుటనుండీ తిరిగినా గిద్దెడు గింజలు దొరకలేదు. మండు వేసవికాలం. ఆ చెవిలోగాడ్పు ఈచెవిలోకి కొడుతోంది. మిట్ట మధ్యాహ్నపుటెండ దుర్భరంగా తోస్తూంది తీక్షణమైన ఆ ఎండలోనే, ఆ వడగాలిలోనే ఆమె ప్రొద్దుటనుండీ యిల్లు యిల్లూ తిరుగుతూంది. అయినా ఏమీదొరకలేదు. దాహంతో నాలుక పిడచ కట్టుకుపోతోంది. కాళ్ళు తేలిపోతున్నై. ముందుకునడవడమే కష్టమయిపోతోంది. అయినా ఆమె అలాగే కాళ్ళీడ్చుకుంటూ ఎదురుగా ఉన్న ఒకపెద్దభవంతిని చేరుకుంది. గుమ్మంలో కారునిలబడిఉంది. ఒంటినిండా బంగారంతో నిండి ఉన్న గొప్ప యింటి యువతులిద్దరు బయటకు వచ్చారు. స్త్రీలు గదా, దయకలుగక పోదని ఆశపడింది భిక్షుకి. చేతులు జోడించి దీనంగా ప్రార్థించింది. "అమ్మా చంటిపిల్లలు — రోజల్లా తిండిలేదు. తల్లీ! కొంచమేమయినా యిప్పించడమ్మా!" భిక్షుకని చూడ్డంతోనే అందులో ఒక భాగ్యశాలిని భగ్గున మండిపోయింది. కనుబొమలు చిట్లిస్తూ దూరంగా తొలగిపోతూ "ఫోఫో దూరంగా! పాడుముండా, మీద

కొస్తావేమే? ఏమే ఊర్మిళా! కాపలావాడెక్కడ చచ్చాడే? పిలిచి బయటకు గెంటెయ్యమను దీన్ని"

భిక్షుకి అవమానంతో కృంగిపోయింది. తాను భిక్షుకే అయినా అందరి మానవుల్లాగే తనకూ మానాభి మానా లున్నాయి అందరూ తన్నెందుకు కంటగించుకోవాలి? తానే సౌఖ్యమాశించి ఈవృత్తి స్వీకరించిందా? అమాయికంగా అత్యాచారానికి గురయిన తన జీవితాన్నందరూ మరింత అవమానిస్తారు ఎందుకు? సౌభాగ్యంలో వారు తనకంటే మిన్నగావచ్చు. కాని సౌశీల్యంలో తాను వారికి తీసిపోదు. బిచ్చ మెత్తడమే తన వృత్తి అయినా ఎక్కడయినా తన అందాన్ని గూర్చిన ప్రశంస వినిపించినా, ఎవరయినా సరససరాగాలకు తయారయినా తానుఅక్కడ క్షణం నిలవ కుండా పారిపోతుంది. వ్యధావ్యధితమై శరీరం భయంతో కంపిస్తుంది.

ఆమె ఎన్నో సారు లీవిధంగా ఆలోచించింది. కాని జవాబు దొరికేదికాదు. ప్రతీసారీ తాను "భిక్షుకికనుక"అని సమాధాన పడేది. ఈ సారి ఇవన్నీ ఒక్కసారిగా ఆమె మెదడులో తుపానులా రేగాయి. తన వయసుస్త్రీయే కేవలం ప్రార్థించినంత మాత్రాన తనపట్ల యింత దురుసుగ వ్యవహరించడంతో ఆమెకు అభిమానం వేసింది తోటి స్త్రీ యింత కఠినంగా ఎలాఉంటుందోనని ఆశ్చర్య పడింది. భిక్షుకి నిరాశతో వెనుదిరగడం జూచి రెండవ యువతి అందుకుంది వ్యంగ్యంగా "నీవే అడుక్కుతింటున్నావు నీకు పిల్లలు కూడానా?"

"పాపం" అని జాలిపడుతోందేమోనని భిక్షుకిప్రాణాలు లేచి వచ్చాయి. ఆశతో విప్పారిన నేత్రాలతో భిక్షుకి ఆ యువతికళ్ళలోకి ఆతురతగా చూసింది. "ఉన్నారు తల్లీ, ముగ్గురున్నారు"

"సారే తినడానికే తిండిలేనప్పుడు పిల్లల్నెందుక్కని కూర్చున్నావ్? తనకు దూర కంతలేదు, మెడకొక ఢోలు కూడానా పో ఫో"

భిక్షుకి యందలి స్త్రీత్వం దెబ్బతింది. మాతృత్వం మెడనులిమినట్టు గిలగిలలాడింది. హృదయం రంపం పెట్టిరెండుగా చీల్చినట్టు బాధపడింది. భిక్షుకి మరొకక్షణ మైనా అక్కడ నిలువలేదు. తనతోటి స్త్రీ, తనలాటి స్త్రీ తన మాతృత్వాన్ని అతి తేలికగా అపహాస్యం చేయకలిగింది—యిదే ఆమె బాధ.

ఎండుటాకులు ప్రోగుజేసి భిక్షుకిఆరోజుదొరికినగిద్దెడు గింజలూ పొంగించే ప్రయత్నంజేస్తోంది. ఆకాసిన్ని గింజలతోనే మరునాటికి ప్రాణాలు నిలబెట్టుకోవడం ఆమె లక్ష్యం. ఆ మరునాడుకూడా అవమానాలతోనూ, దుస్సహ వేదనలతోను నిండిఉంటుందని ఆమెకు తెలుసు. అయినా ఆ మరునాటి కోసం ఆమె ఆశతో ప్రతీక్షించక మానదు, తీవ్ర వేదనాభరితమై, నైరాశ్య పూరితమైయుండే మానవ జీవితంలో "రేపు" అనేది ఒక ఆశాకిరణం.

విమలపిలుపువిని భిక్షుకి విసుక్కుని అయిష్టంగాఅంది "ఏం! ఏంకావాలి? మళ్ళీ వచ్చావు?"

అంటుకని కూర్చుంటూనే మృదువుగా ప్రారంభించింది. "యివిగో చెల్లీ, యివన్నీ నవీనబాబు నీ కోసం పంపించాడు."

ఇదివినడంతోనే విమలను దుఃఖంతోనూ, రోషంతోనూ అసహ్యంగాచూస్తూ అంది "నన్నూ నా పిల్లలనూ ఎందుకవమానిస్తావు? వెళ్ళు. నీ సామాను నీవు తీసుకుని పో! మళ్ళీ యీ వేపుకురాకు"

"నీవింకా చిన్నదానవు చెల్లీ. ప్రపంచమంటే నీకు తెలీదింకా! వరించిన అదృష్టాన్ని కాలదన్నుకుంటే తర్వాత విచారించి ప్రయోజన మేముంది? తిండిలేకుండా ఎన్నాళ్ళుంటావు? పిడికెడు, పిడికెడు చొప్పున ఎన్నాళ్ళు తిరిగితే పొట్టనిండుతుంది? పైగా ముగ్గురు పిల్లలాయె వృధాగా కష్టాలతో కృంగి, కృశించిఎన్నాళ్ళిలా జీవచ్ఛవంలా జీవిస్తావు? జీవితంలో అనుభవించాల్సిన వెన్నో ఉన్నాయి. నీకు మాత్రం కోరికలుండవా? మా యజమాని నిన్ను తన రాణిలాగ చూసుకుంటా నన్నాడు. మేమంతా నిన్ను సేవిస్తూంటాం. పిల్లలు కూడా చదువు సంధ్యలు నేర్చుకుని బాగుపడతారు. వాళ్ళకోసమయినా ఆలోచించు నవీన బాబుతో సరితూగగల ధనికుడీ పట్టణంలో ఎవరున్నారు? సందేహించకు చెల్లీ!" విమల పరమ హితురాలుగా బోధజేస్తూంది. భిక్షుకి గంభీరంగాకూర్చుంది. విమల బోధల్లో ఆమె చెవిలోపలికి ఎన్ని తక్కువ మాటలు వెళ్ళాయో ఆ పరమాత్మునకే తెలియాలి. గంభీర ముద్రను వదలి ఆమె ఒక్కసారిగా అంది. "నువ్వెళ్ళిపో— నా పిల్లలను నిద్రించుకోవాలి!" యిలా అంటూనే విమల తెచ్చిన ధాన్యపుగంప, యితర వస్తువులు గుమ్మం బైటకు నెట్టేసి తడిక బిగించేసింది. విమల ఒక్కక్షణం అలాగే నిలబడి ఎదో గొణుక్కుంటూ వెళ్ళి పోయింది.

"అమ్మా. ఆకలిమండి పోతుంది. నీకాళ్ళట్టు కుంటాను ...కాస్త అన్నంపెట్టమ్మా!" "మాట్లాడవేమే! నేను చత్తున్నాను చూడమ్మా..కొత్తరొట్టిముక్క పెట్టవూ?"- ఈ వరసన పిల్లలిద్దరూ ఒకటేగోల. చింకి బట్టలలోనుండి వారిప్రక్క ఎముకలు స్పష్టంగా కనుపిస్తున్నై. పొట్ట వెన్నెముక నంటుకుని నిగూఢ జీవితసత్యాలను వేటినో తెలియజెప్పుతున్నట్టనిపిస్తోంది. లోకమంటే ఏమిటో తెలియక, కల్మషము, కపటము, కుట్రలు కుహకాలు ఈషణ్మాత్రమైనా తెలియని ఆ చిన్నబిడ్డల నీ దుస్థితి కీడ్చినదెవరు? ఓపినంత భరించుకొమ్మని నిర్దయగా ఈ నికృష్ట జీవితానికి గురిజేసినదెవరు? —యిదే ఆ తల్లికి అంతు దొరకని ప్రశ్న!

మూడోపిల్లడుకూడా గుడిశెలో ఒక మూల నిర్జీవంగా పడున్నాడు. ఆ బొమికల గూడులో ఏమూలనైనా కాస్త జీవమున్నదను కోడానికా తల్లికెక్కడా ఆధారమే కనుపించలేదు. వాడుచచ్చి పోయాడనే ఆతల్లి భావించింది. ధారాప్రవాహంగా కన్నీరు కాల్వలు కట్టించలేకపోయింది. కనీసం తన చిన్నారి ముద్దు బిడ్డని ఋష్కించిన ఆ వదనంపైపు అంతిమ సమయంలో, అతడు తన్ను వీడి శాశ్వతంగా భూదేవి గర్భంలో నిద్రపోనున్న ఆ సమయంలో కూడా తదేకంగా చూడుకోవాలని ఆమెకు తోచలేదు. ఆమె. ఆభిక్షుకి నట్టింట్లో నిర్వికారంగా మోకాళ్ళసందున ముఖం దాచుకొని చేతులు కాళ్ళకు చుట్టుకుని కూర్చుంది. ఆమె హృదయంలో ఏమేమి ఊహలు, భావాలు రగులుతున్నవో, ఏ వికారాలు కలుగుతున్నవో ఎవరు చూడగలరు? ప్రియపుత్రుని మరణానికి శోకించకుండా, ఏదో పరమసత్యాన్ని గ్రహించిన దానిలా, పెద్ద తత్వవేత్తలా అలాకూర్చుండి పోయిన ఆ మాతృమూర్తి అజ్ఞాత భిక్షుకి....

భిక్షుకిలో చైతన్యం నశించిపోయింది. కేవలం స్థాణువులా కూర్చున్న ఆమెకు బాహ్యప్రపంచముతో నిమిత్త మున్నట్టే లేదు—

"అ ...మ్మా"! —భిక్షుకి ఉలిక్కిపడింది. ఆస్వరం ఆ పిలుపు ఎక్కడో పాతాళమునుండి వినిపించిన మరణ వేదనలా ఉంది. దౌర్భాగ్యంతో సతమతమైనశించిపోనున్న ఆఅర్భకుడు సత్తువకొద్ది మృత్యువుతో పెనుగులాడి చివరకు నిస్సహాయుడై కూలిపోతూ ఆఖరుసారి మాతృమూర్తిని స్మరించు కుంటూన్న ట్లున్నదా పిలుపు— భిక్షుకి ఆత్రుతతో అతని దగ్గర కొచ్చిచూసింది, వాడింకా చచ్చిపోలేదు. కొద్దిగా శ్వాస ఆడుతూనే ఉంది. నిజమే. . వాడు చివరిక్షణాల్లోఉన్నాడు — ఆమెలో మాతృప్రేమ ఒక్కసారి మరలాఉప్పొంగింది. ధైర్యం, స్థైర్యంసడలి పోయాయి. — తనకాళ్ళకు చుట్టుకుంటున్నపిల్లలిద్దరను ప్రక్కలకు త్రోసేసి ఒక్కసారిగా వెర్రిదానిలా ఆ అంధకారంలోనే బయటకు పరుగెత్తింది.

అలా ఆ అంధకారంలోనే అగమ్యంగా పరుగెత్తిన భిక్షుకి క్షణంలో నవీనబాబు కెదురుగా నిలబడి యుంది. నవీన్ ఆమెను చూసి నిశ్చేష్టుడై పోయాడు.

"నీవు.... నీవా భిక్షుకీ? వచ్చావా— నిజంగా?.. యిది కలకాదుకదా?" ఆవేశం, ఆశ్చర్యం ఆప్యాయత పెనగొని తనను తానే నమ్మలేక పోతున్నట్టు పలకరించాడు. "అవును.... నేనే — భిక్షుకిని వచ్చాను నిజంగానే! కాని, ఇదిగో ఇటు చూడు — నేను వచ్చింది కామంతో కండకావరమెక్కి మాత్రంకాదు! నీయౌవన నీచ తృష్ణలను తీర్చి, తద్వారా కొంతడబ్బు సంపాదించి, దానిమూలంగా ...మృత్యువుతో పోరాడ్తున్న పసిగందుకు సాయంచేయాలని, ఆకలితో నకనక లాడ్తున్న బిడ్డలకింత గంజిపోయాలని, వేరువిధాలుగా విశ్వప్రయత్నాలూచేసి విఫలమంది, విధిలేక మాతృ హృదయం నన్నిలా లాక్కువచ్చింది! రా-తొందరగా నీపనేదో కానిచ్చుకో! నీ వివ్వదల్చిందేదో ఇయ్యి- వేగంగా పోవాలి, నాబిడ్డల్ని కాపాడుకోవాలి! గబగబా పలికింది.

నవీనుడు చిరకాలంగా తపస్సు జేస్తున్న ఫలం నేటికి లభ్యము కానున్నట్లయింది. అతనిలో స్వార్థం, మోహం పెనగొని ఆమెస్థితిని గమనించనీయలేదు. అతని లోని పశువు విజృంభించింది. యౌవనం ఆకాశపు అంచులు తాకింది. రక్తం పొంగి పొరలింది— మత్తుతో మనోజ్ఞానం లేనివాడై అతడు చేతులుచాచి ఆహ్వానిస్తూ "రా! భిక్షుకీ, రా! .... అబ్బ ఎన్నాళ్ళుగా, యీ మధురక్షణంకోసం, నీకోసం, ...నీ అనంత సౌందర్యాన్ని కొల్లగొనాలని, నీ కౌగిట్లోకరిగి పోవాలని ....తపిస్తూ"....అంటూనే రెప్ప వేయకుండా ఆమె ముఖంవంకే చూస్తూ ముందు ముందుకు వస్తూన్న నవీనుడు అకస్మాత్తుగా రెండడుగులు వెనక్కువేసి భయంతో కంపించి పోయాడు. అతని మేనురుఝల్లుమంది.

హృదయం చల్లబడి తల తిరిగి పోయినట్లయింది. కరెంటు షాకుతిని మరణవేదన పడుతున్న వ్యక్తిలా ఆతడు ఆ క్షణంలో బాధపడ్డాడు--కృంగి పోయాడు. కారణం భిక్షుకి ఏడుస్తోంది....తనబిడ్డల్ని తల్చుకొని ఆ మాతృ హృదయం రోదిస్తోంది! .... దానికి అతనిలోని మానవుడు మేల్కొన్నాడు. అతనికళ్ళ పొరలువిడి భిక్షుకికళ్ళయందలి తేజస్సును గుండెలుగుండా దూసుకపోయి, లోని అనంత సౌందర్యాన్ని —హృదయ సౌందర్యాన్ని —దర్శించ గలిగాయి అదే మాతృ వాత్సల్యం! ఆ స్నేహ వాత్సల్య సుధా బిందువులే వింత కాంతితో ఆమెనయనద్వారముల గుండా వెలువడి అతని హృదయాంతరాళములందు నిద్రిస్తూన్న మానవుణ్ణి తట్టిలేపాయి. మానవుడు ఉగ్రుడై లేచాడు. పశుత్వాన్ని నిర్జించాడు. తల్లిముందు మోకరిల్లాడు. నవీను డను కొన్నాడు తను..తను. ఎవరిపొందు నాశించి వెళ్తున్నాడు? తల్లీ. తల్లి పొందు నాశించి వెళ్లమన్నాడు. ఇపుడు భిక్షుకి నేత్రాలు ఉజ్వలవంతంగా వెలిగిపోతున్నై. ఆ నయన కాంతుల్లో మాతృ దేవి స్నేహ వాత్సల్యం తొణికిస లాడుతున్నది. మాతృ మూర్తి స్నేహస్నిగ్ధ వాత్సల్యానికి కై మోడ్చి ముగ్ధుడై దాసోహమన్నాడు.. అంతే! "అమ్మా ..." అంటూ నవీనుడు చేతులు జోడించి ఆ మాతృ మూర్తిముందు మోకరిల్లాడు. ఆమె యుద్విగ్న చిత్తయై అలాగే నిలిచియుంది




మీ బిడ్డ మామూలుగా భుజించనిచో

మందంగా వుండి, పొట్ట ఉబ్బివున్నచో, బహుశా కడుపులో బల్ల (లివర్) పెరుగుతుండవచ్చు. యీ లివర్ వ్యాధి సాధారణముగా 3 సంవత్సరాలలోపు పిల్లలకు వచ్చుట సహజము.



జమ్మి వారి

లివర్‌క్యూర్

లివర్ & స్ప్లీన్ వ్యాధుల చికిత్సకు, నివారణకు.

JVZ-1 T6




ఇప్పుడు మాత్రల రూపంలో లభిస్తున్నది.

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్,
'జమ్మి బిల్డింగ్స్', మైలాపూర్, మద్రాసు.
శాఖ: పోరుగంటివారి వీధి, విజయనగరం సిటీ,
మరియు ఇతర స్థలములలో.

# సంక్షేమం





జో అచ్యుతానంత జోజో ముకుందా..............  — కల్యాణ ప్రసాద శర్మ.

# ANDHRA MAHILA SABHA
## NURSING HOME
REPORT FOR MAY 1956

**MATERNITY WARD**

| | |
|---|---|
| No. of Patients admitted for Deliveries | 114 |
| ,, ,, Surgical cases treated | Nil |
| ,, ,, Medical cases treated | 1 |
| ,, ,, Gyneac and Abortions | 26 |
| ,, ,, Ante-natal | 35 |
| ,, ,, Post Natal | 1 |
| ,, ,, normal deliveries | 98 |
| ,, ,, abnormal deliveries | 16 |
| ,, ,, babies | 113 |
| Grand total | 293 |

**IN-PATIENT MATERNITY**

| | | |
|---|---|---|
| No. of patients Delivered | | 114 |
| ,, ,, normal Deliveries | | 98 |
| ,, ,, abnormal Deliveries | | |
| Twins | 1 | |
| Breach | 7 | |
| forceps | 8 | 16 |
| Total | | 114 |

**OUT-PATIENT DEPARTMENT**

| | |
|---|---|
| No. of Surgical cases | 112 |
| ,, ,, Medical cases | 693 |
| ,, ,, Ante-natal cases | 254 |
| ,, ,, Post-natal cases | 94 |
| ,, ,, Gyneacological cases | 93 |
| ,, ,, E.E.N.T. cases | 50 |
| Total No. of New patients | 1296 |
| Total No. of Old patients. | 1814 |
| Grand Total | 3110 |

NURSES' TRAINING CENTRE

Out of 60 candidates undergoing the auxiliary training 30 will be completing their course in July 1956. 30 candidates sponsored by the Central Social Welfare Board have been taken in this year and have started their training. The Andhra Government have promised to sponsor 30 more candidates.

Mrs. LAKSHMI PARVATHI
*Secretary and Convenor*

Mrs. A C KRISHNA RAO
*Administrative Secretary*

Dr. M. PAVANA BAI
*Medical Superintendent*

# ఉత్తర మండలంలో సంఘ సంక్షేమం

ఢిల్లీలో రాష్ట్రీయ సలహా సంఘాధ్యక్షుల, ప్రాజెక్టు నిర్వాహణ కమిటీ కార్యకర్తల సమావేశం.

"సోషలిస్టు పద్ధతిని సమాజ వ్యవస్థ నిర్మించడమంటే సర్వోదయ సమాజం ప్రాతిపదికకాగల సమాజమనే తాత్పర్యంకాగల"దని భారత ప్రభుత్వం ప్లానింగ్ శాఖా మంత్రి శ్రీ జి. ఎల్. నందా పేర్కొన్నారు.

ఉత్తర మండలంలోని రాష్ట్రీయ సంఘ సంక్షేమ సలహా సంఘాల అధ్యక్షులు, ప్రాజెక్టు నిర్వాహణ కమిటీల కార్యకర్తలు 1956 ఏప్రిల్ నాలగవ తేదీ నుంచి నాలుగు రోజులపాటు న్యూ ఢిల్లీలో జరిగిన సమావేశం సందర్భంగా ప్రసంగిస్తూ సోషలిస్టు పద్ధతిని సమాజ నిర్మాణమంటే పారిశ్రామికాభివృద్ధిగాని, దాని సత్వర జాతీయకరణకాని కానక్లే, ప్రజాస్వామికమంటే ఉన్నత నాయకుల సంఘం పరిపాలన కానేరదని శ్రీ నందా అన్నారు. ఈ రెండింటినీ సాధించడానికి సంక్షేమ కార్యక్రమాలు మిక్కిలి పేదవారికి కూడా ప్రయోజనకరం కాదగు విధంగా విస్తరించబడాలని, పౌరులందరు తమ తోటి పౌరుల సేవకు తగు విధంగా కృషి చెయ్యవలసి వుంటుందని వివరించారు.

సంఘ సంక్షేమ కార్యక్రమం ఏదో అనుబంధ వృత్తిగా భావించబడరాదని శ్రీ నందా కార్యకర్తలను హెచ్చరించారు. అది క్రమబద్ధంగా నిర్వహించబడవలసిన కార్యక్రమమని వక్కాణించారు. సోషలిస్టు సమాజాన్ని సాధించాలన్నా, ప్రజాస్వామికం పరిరక్షించబడాలన్నా కేవలం ప్రభుత్వ కృషిపైన మాత్రమే మనం ఆధారపడరాదని స్వచ్ఛంద కృషికూడా ఇతోధికంగా కొనసాగాలని ఆయన ఉద్ఘాటించారు.

దీనికి ముందు కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ విధులను ఆ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు వివరిస్తూ సంక్షేమ విస్తరణ కార్యక్రమ కేంద్రాల విషయమై కొన్ని చోట్ల ఏర్పడివున్న సందిగ్ధ పరిస్థితులను వివరించారు. కమ్యూనిటీ ప్రాజెక్టు కార్యక్రమాలు, సంక్షేమ విస్తరణ కార్యక్రమాలు చేసేపని ఒక్కటి కాదని సంక్షేమ విస్తరణ కార్యక్రమాలు కేవలం స్త్రీలు, పిల్లలు, వికలాంగులు, బాలనేరస్థులకు మాత్రమే నిర్దేశించబడినవని అన్నారు. కమ్యూనిటీ ప్రాజెక్టు కార్యక్రమాలలో వీరి విషయం ఎక్కడా లేదన్నారు. ఈ కార్యక్రమం దేశంలో వ్యవసాయ ఆర్థికాభివృద్ధుల సాధననే లక్షించే జాతీయ వికాస కేంద్రాల కృషికి అనుబంధకృషిగా వెలయగలదని శ్రీమతి దేశ్‌ముఖ్ వివరించారు. ఈ కేంద్రాలను బహుళార్థ సాధక సంఘాలుగా చెయ్యడానికి సర్వవిధాల యత్నం

జరుగుతున్నదని, అప్పుడే 293 ప్రాజెక్టుల క్రిందవున్న 1400 కేంద్రాలలోను 1000 కేంద్రాలు బహుళార్థ సాధక కేంద్రాలుగా రూపొందినవని ఆమె చెప్పారు. స్త్రీలకు అక్షరాస్యతకు, సాంఘిక విద్యాభ్యాసానికి, పిల్లలకు వృత్తి విద్యల బోధనకు, ప్రసూతి, శిశు ఆరోగ్య సంరక్షణలకు ఈ కేంద్రాలలో ఏర్పాట్లు చెయ్యబడుతున్నవని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు అన్నారు.

ఈ సమావేశం ఢిల్లీ రాష్ట్రీయ సంఘ సంక్షేమ సలహా సంఘం ఆధ్వర్యాన జరిగింది. 1956 ఏప్రిల్ 4వ తేదీ నుంచి నాలుగు రోజులపాటు జరిగిన ఈ సమావేశంలో పంజాబ్, పెప్సు, హిమాచల ప్రదేశ్, వింధ్య ప్రదేశ్, ఢిల్లీ, జమ్ము, కాశ్మీర్, అజ్మీర్, రాజస్థాన్‌లలోని రాష్ట్రీయ సంఘ సంక్షేమ సలహా సంఘాల అధ్యక్షులు, సంక్షేమ కార్యకర్తలు తమ నివేదికలను చదివారు. తమ తమ రాష్ట్రాలలో ప్రత్యేకంగా ఎదుర్కొంటున్న సమస్యలను గురించి చర్చించుకున్నారు. కార్యకర్తల సమిష్టి సమస్యలపై సమావేశం తుది రోజున చర్చ జరిగింది.

కేంద్రానికి యిప్పుడున్నట్లు ఒక గ్రామసేవిక, దాయి తక్కువ అని, వృత్తి విద్యా బోధనకువేరే ఉపాధ్యాయుడు వుండాలని సూచించబడగా ప్రతి కేంద్రానికి వృత్తి బోధకుని నియామకానికి ఏర్పాటు జరిగిందని, యిది 1956 ఏప్రిల్ మొదటి తేదీనుంచి ప్రారంభం కాగల మూడేళ్ళ స్టాండర్డ్ బడ్జెట్‌లో చేర్చబడ్డదని అధ్యక్షురాలు అన్నారు.

సంక్షేమ కార్యకర్తలు పరిసర గ్రామాలకు వెళ్ళినపుడు కూడా వుండడానికి, తరగతులకు హాజరయ్యే పిల్లల రాకపోకల సందర్భంగా కూడా వుండడానికి ఒక స్త్రీ అటెండెంట్‌ను నియమించాలనే సూచన జరిగింది.

గ్రామసేవికలతోను దాయీలతోను కూడా వెళ్ళడం, నీళ్ళు తేవడం, ప్రసూతి కేసులలో దగ్గర వుండడం వంటి చిన్న చిన్న పనులకు కంటింజెన్సీల మొత్తం నుంచి చిన్న చిన్న మొత్తాలు తాత్కాలికంగా ఖర్చుపెట్టి స్థానికంగా ఆ పనులు చేయించుకోవచ్చునని, ప్రత్యేకంగా అటెండెంట్‌ను గాని, అటువంటి ఉద్యోగినిగాని నియమించడానికి అవకాశం లేదనీ అధ్యక్షురాలు వివరించారు.

ప్రతీకేంద్రానికీ సుశిక్షణ పొందిన దాయి కంటె మంత్రసానిని నియమించడం యుక్తం కాగలదనే తాము భావిస్తున్నామని కార్యకర్తలు అన్నారు. ప్రతీకేంద్రంలోను సుశిక్షితురాలైన మంత్రసానిని అట్టేపెట్టడం సాధ్యపడదని మంత్రసానులు ప్రతి ప్రాజెక్టుకు నియమించబడు తున్నారని, వచ్చే పంచవర్ష ప్రణాళిక పరంగా ఆరోగ్య పథకంక్రింద అనేకంగా దేశవిస్తృతంగా ఏర్పాటుచెయ్య బడుతున్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సహాయ సహకారాలను కార్యకర్తలు పొందవచ్చునని అధ్యక్షురాలు విశదీకరించారు.

సంక్షేమ విస్తరణ ప్రాజెక్టు భవనాలకు 2500 రూ॥ గ్రాంటు చాలదని, దానిని 5,000 రూ॥లకు హెచ్చించాలని కార్యకర్తలు సూచించగా ఆదిలో ప్రాజెక్టు భవనాలకు గ్రాంటులిచ్చే అవకాశమేలేదని, అయితే ఆ తర్వాత భవనాలకు కొంత ద్రవ్యం మంజూరు చేసే అవకాశం కలిగించబడ్డదని అధ్యక్షురాలు అన్నారు. ప్రస్తుత ఘట్టంలో దేశంలో ఈవిధంగా గ్రాంటులివ్వవలసిన కేంద్రాలు 6,000 నుంచి 7,000 వరకు వుండడం దృష్ట్యా స్థలం క్రింద యిస్తున్న ఈ 2500 రూ॥ల గ్రాంటును మార్చే అవకాశం లేదనీ, ప్రాజెక్టు నిర్వహణ కమిటీలో ఇంకా ఎక్కువగా విరాళాలు సేకరించగలిగే పక్షంలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ 2500 రూ॥లను మించి మరి కొంత ద్రవ్యం 'గ్రాంటు'గా యివ్వగలదని పేర్కొన్నారు.

ప్రతీ కేంద్రంలోని ఉద్యోగులు త్వరితంగా రాక పోకలు సాగించడానికి ఒక్కొక్క సైకిలును సమకూర్చాలని కార్యకర్తలు సూచించారు. ప్రాజెక్టు నిర్వహణాధికారులు వీటిని సమకూర్చాలని, లేదా కార్యకర్తలు స్వయంగా సైకిళ్ళకు ఏర్పాటుచేసుకోవాలనీ వాటి 'మెయింటెనెన్సు' క్రింద కేంద్ర సంక్షేమ సంస్థ తగు మాత్రం అలవెన్సు యివ్వగలదని నిర్ణయించబడింది.

ఒక రేడియోను, ప్రొజెక్టరునుకూడా కేంద్రాలకు సప్లయి చెయ్యాలన్న కార్యకర్తల సూచనకు అధ్యక్షురాలు సమాధానమిస్తూ జాతీయ వికాస కార్యక్రమాలు, ప్రభుత్వ సమాచార బ్రాడ్‌కాస్టింగ్ శాఖలకు చెందిన ప్రచార కేంద్రాలు, ఆరోగ్య, విద్యా, అభివృద్ధిశాఖ మంత్రివర్గాల ఆధ్వర్యంలోని ప్రచారక సంఘాలు అటువంటివాటిని సమకూర్చడానికి తమ కార్యక్రమాలలో ఏర్పాట్లు చేసుకొని

వున్నవని, ఈ కేంద్రాల సహకారంతో కార్యకర్తలు వీటిని వుపయోగించుకొంటూ వుండవచ్చునని అధ్యక్షురాలు అన్నారు. కమ్యూనిటీ ప్రాజెక్టు నిర్వహణాధికారులకు, మన శాఖలలోని ఉద్యోగులకు మధ్య సహకారాన్ని సుసంఘటితం చెయ్యడగు విధానాలను గురించి యోచించబడుతున్నదని కూడా అధ్యక్షురాలు వివరించారు.

కార్యకర్తలకు కొన్ని సూచనలు కూడా చేశారు. ప్రాజెక్టు నిర్వహణ కమిటీల పునర్వ్యవస్థీకరణ క్రమశః జరగాలన్నారు. ఈకార్యక్రమంపట్ల శ్రద్ధాసక్తులున్నప్పటికీ తీరిక లేకగాని, యితర కార్యాలవల్లగాని దీనిపట్ల తమ దృష్టిని కేంద్రీకరించ లేనివారు క్రమంగా ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించగలవారికి చోటివ్వాలన్నారు.

కేంద్రాలు కేవలం ప్రసూతి మందిరాలుగా మాత్రమే వినియోగించబడక యితర ప్రాజెక్టు కార్యక్రమాలకు కూడా అవకాశం వుండాలని, కొన్ని రాష్ట్రాలలో సంస్థ వివరాలకు తగినట్లు 'మాచింగ్' వివరాలు రావటం లేనందున ఆ వివరాల సేకరణకు ఎక్కువ కృషి జరగాలని శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ అన్నారు.

రాష్ట్రసంక్షేమ సంస్థల అధ్యక్షులు కార్యకర్తలు తమ తమ సమస్యలను పరస్పరంగా చర్చించుకొన దానికి సమావేశం అవకాశం కలిగించింది. సమావేశం ఏర్పాటు చేసిన ఢిల్లీ రాష్ట్ర సంక్షేమ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి రక్షాశరణ్ వందన సమర్పణతో సమావేశం ముగిసింది. సమావేశ కార్యక్రమంలో పాల్గొనడంతో పాటు షహదారా ప్రాజెక్టు, న్యూఢిల్లీలోని అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలను కూడా వచ్చిన వారు దర్శించారు.

కేంద్ర సంక్షేమ సంస్థ కార్యలయంలో వీరికి విందు కూడా చెయ్యబడింది.

---

# అఖిల భారత మహిళా ఆశ్రమము

## లక్ష్మణ్ చౌక్, డెహరాడూన్

స్థాపితము : 1945. రిజిష్టరు కాలేదు.

స్థాపకులు : స్థానిక ఆర్య సమాజ్ అండ్ చరఖా మండలి సభ్యులు. శ్రీమతి సరస్వతీదేవి సోనీ.

అధ్యక్షులు : శ్రీమతి సత్యవతి సితానీ.

కార్యదర్శి : శ్రీమతి సుశీలాదేవి మాంగ్లిక్.

ఆశయములు : కష్టములోనున్న స్త్రీలను ఆదుకొని దారి చూపుట. అగతికల కాశ్రయమిచ్చుట.

కార్యక్రమములు : 8 వ తరగతి వరకు గల ఒక స్కూలు నడుపుట. ఆశ్రమవాసులు హిందీ, సంస్కృత పరీక్షలకు శిక్షణ నొసగి పంపుట. ఏకులు చేయుట. నూలువడకుట, దర్జీ నేత మొదలగునవి. గ్రామసేవ నర్సింగ్, మిడ్ వైఫరీ, ప్రథమ చికిత్సలు నేర్పించుట.

ఆర్థికస్థోమత : సరాసరి సంవత్సరపు రాబడి రూ॥ 8000 లు. ఖర్చు రూ॥ 8500 లు. స్టేటు ప్రభుత్వం నుండి, పురపాలక సంఘమూ, ప్రతిమాసము చందాలు, విరాళములును ఆదాయము.

రిమార్కులు : ఆశ్రమము గరిష్ట సంఖ్య 50. ప్రస్తుతము ఆశ్రమములో నున్నవారి సంఖ్య 20. వేతనములు తీసికొని అయిదుగురునూ, తీసికోకుండా అయిదుగురును ఈ ఆశ్రమమున పనిచేయుచున్నారు.

---

# హిందూ వితంతు పునర్వివాహాలు

మహిళా మహోదయానికి నాంది పలికిన శాసనం శతవార్షికోత్సవం ఈ ఏడే.

శ్రీ ఎం. వి. రమణారావు

(పూర్వం 'ఇండియన్ రిపబ్లిక్' ఎడిటర్)

1957 లో భారత ప్రజ తమ స్వాతంత్ర్య సమరోత్సవ శతవార్షికోత్సవం జరుపుకొంటే, భారత మహిళలు ఈ సంవత్సరం తమ స్వీయ విమోచన శతవార్షిక దినోత్సవం జరుపుకొనగలరు. నిజానికి 1856 లో హిందూ వితంతు పునర్వివాహ శాసనం ఆమోదించబడడంతోనే భారత మహిళల విమోచనం ప్రారంభమయింది. ఈ శాసనానికి పూర్వం, వెనుక సంభవించిన సంఘటనల పరిణామం ఒక దారుణ విషాదగాథ. హిందూ వితంతు పునర్వివాహాల పట్ల ద్వేషం యిప్పటికీ దేశంలోని కొన్ని కొన్ని ప్రాంతాలలో- ఏదో ఒక రూపంలో దుర్బలంగానైనా కనిపిస్తూనే వుంది. మతం పేరిట ఈ దురాచారం యిప్పటికీ ప్రజలను తన ఉచ్చులలో బిగిస్తూనేవుంది.

వితంతుపునర్వివాహాలను వేదాలు, ఉపనిషత్తులు



నిషేధించాయన్న సనాతనుల వాదం ఏనాడో ఖండించబడింది. వితంతువుల తరపున ఈశ్వరచంద్ర విద్యాసాగర్, రాజా రామమోహనరాయలు ప్రచండమైన ఉద్యమాన్ని సాగించారు. భర్త మరణిస్తే అదే చితిపైన భార్యకూడా బ్రతికివుండగానే ప్రాణంతీసుకొనే అమానుష సహగమన దురాచారాన్ని తీవ్రంగా విమర్శించి, ప్రభుత్వంచే నిషేధింపజేసి. శ్రీ రాజా రామమోహనరాయులు హిందూ వితంతువులకు మహోపకృతి కావించినాడు. వితంతువుల పునర్వివాహ నిషేధంపైన కూడా ఉద్యమం చాలా తీవ్రంగా సాగింది. తత్ఫలితంగానే 1856 లో శాసనం జరిగింది. ఈ శాసనాన్ని ఆమోదించడం ద్వారా సంఘంలో వ్రేళ్ళు పాతుకొనివున్న దురాచారాల నిర్మూలనకు మరింత తీవ్రంగా కృషిచేసే అవకాశాన్ని సంఘసంస్కర్తలకు కలిగించినందుకు భారత మహిళాలోకం ప్రభుత్వానికి ఋణపడివుంది.

హిందూ వితంతు పునర్వివాహ శాసనం పరంగా చట్టరీత్యా ప్రతిబంధకం తొలగించబడినప్పటికీ వితంతువులపట్ల సంఘంలో ఏవగింపు, నిరసన, మూఢనమ్మకాలు తొలగిపోలేదు వితంతు వివాహం బృహత్తర సమస్యగానే వుండిపోయింది. వితంతు వివాహం జరిగిన కుటుంబాన్ని సంఘం వెలివేసేది. ధీరోదాత్తమైన హృదయాలు కలవారే సంఘాన్ని ధిక్కరించడానికి సాహసించేవారు. ఈవిధంగా చాలాకాలం శాసనం జరిగినా అది ఆచరణలో మాత్రం మృతప్రాయంగానే వుంటూ వచ్చింది. అస్పృశ్యతా నిర్మూలన శాసనంలోవలె, చట్టధిక్కారం శిక్షార్హమైన నేరంగా పరిగణించబడుతూ వున్నట్లే, పునర్వివాహాలు చేసుకొన్నవారిపై ఆత్మరహితమైన సంఘం బహిష్కరణను అమలు జరపడాన్నికూడా శాసనపరంగా నిషేధించివుంటే వితంతు పునర్వివాహోద్యమం మరింతగా బలపడివుండేది. అయితే సనాతనులు ఎన్నిచిక్కులు తెచ్చిపెట్టినా, ఎంత క్రౌర్యంతో ప్రవర్తిం

చినా సంస్కర్తలు నిరుత్సాహపడక, మహోత్సాహంతో తమ ఉద్యమాన్ని కొనసాగిస్తూనే వచ్చారు.

హిందువులలోని కొన్ని అగ్రవర్ణాల వారిలోనే ఈ వెలి, బహిష్కారం అమలు జరుగుతున్నాయి కాని, తక్కువ తరగతుల వారిలో పునర్వివాహం ఆచారంగానే వుండడం విపరీతం. అలాగే కొన్ని వర్ణాల వారిలో విడాకులివ్వడం, వితంతు పునర్వివాహం కూడా మత సాంప్రదాయంగానే వుంటూ వుండడం కూడా వైచిత్ర్యమే. ఈవిధంగా ఆచారాలతోను, మూఢనమ్మకాలతోను చీలిపోయిన సంఘాన్ని సంస్కర్తలు ఎదుర్కొనవలసివచ్చింది.

సుమారు 60 సంవత్సరాల క్రితం దక్షిణ భారత దేశంలో హిందూ వితంతు పునర్వివాహాలకోసం సనాతన సంఘంతో నిర్విరామంగా సమరం సాగించిన గొప్ప సంఘసంస్కర్త కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు. ఆంధ్ర దేశపు ఈశ్వరచంద్ర విద్యాసాగరుడని ఆయనను అభినుతించవచ్చు. బెంగాల్‌లోనూ, ఉత్తరాదిని హిందూ వితంతు పునర్వివాహాలకోసం సాగిన కృషి క్రమశః ఫలితాలనిస్తున్న సమయంలోనే దక్షిణాదిని సనాతనాచార సంప్రదాయాల మధ్య సంఘం నలిగిపోతున్న సమయంలో వేద వేదాంగాలలో అసమాన ప్రజ్ఞా ప్రభావాలుకల మహాపండితుడు శ్రీ వీరేశలింగం గారు అచంచల ధైర్య సాహసాలతో, శ్రుతి స్మృతేత్యాది ఆయుధాలతో పోరుతూ హిందూ వితంతు పునర్వివాహోద్యమాన్ని నిర్వహించారు. సనాతన బ్రాహ్మణ నాయకులను తీవ్రంగా ప్రతిఘటించి వాదోపవాదాలు జరిపి నిగ్రహించుకు వచ్చారు.

శతాబ్దానుశృతమైన దురాచారానికి, సత్కార్యాచరణ పట్ల గల నైతికోత్సాహానికి మధ్య సంఘం నలిగిపోతూ వచ్చింది.

వీరేశలింగం పంతులుగారి శంఖారావం సంఘంలో మహాద్భుతమైన సంచలనం కలిగించింది. చైతన్యం రేకెత్తింది. వితంతు పునర్వివాహాలు జరగసాగాయి. అయితే సంఘ బహిష్కరణ తప్పేదికాదు. ఈ బాధను వ్యాసరచయిత తలిదండ్రులే అనుభవించినవారు కావడం వల్ల పునర్వివాహం చేసుకొన్న యువదంపతులు ఎట్టి చిక్కులకు లోబడవలసివచ్చేదీ వివరిస్తూవుండేవారు.



ఆ దంపతులు గ్రామానికి వెలుపల ఏదో పూరింట నివసించవలసి వచ్చేదిట. గోదావరినుంచి పగటి పూట నీరు తెచ్చుకోవడానికి వీలు లేనందున రాత్రి మాటుమణగిన పిమ్మటనే తెచ్చుకోవలసి వచ్చేదిట.

ఈ నాడంత తీవ్రమైన బాధలు లేవు. కాని నిరుపద్రవకరమైన అనేక రూపాలలో యిప్పటికీ పల్లెపట్టులో వితంతువులపట్ల సాధారణంగా కల జుగుప్స కనిపిస్తూనే వుంటుంది. నేటికీ కేశఖండన చేయించుకొని, ముసుకగుడ్డలుధరించిన వితంతువులు, వితంతువులపై జరుపబడిన ఘోరమైన దౌర్జన్యానికి ప్రతిస్వరూపాలుగా కనిపిస్తారు. హిందువు అని సూచించే తిలకానికి వీరు నోచుకోలేదు. బయటకు వచ్చేసరికి వితంతువు ఎదురైతే- యిక ఆనాటికి అన్ని పనులు దగ్ధమేనన్న మూఢనమ్మకం యిప్పటికీ తొలగలేదు. ఇటువంటివి అనేకం వున్నాయి. దీనినిబట్టి నాగరికత, సంస్కృతీ ప్రభావం సంఘం పైఅంచుల వరకు మాత్రమే వ్యాపించి వుందని వ్యక్తమౌతుంది.

మనం యిప్పుడు సోషలిస్టు రాజ్యాన్ని సంతరించుకోబోతున్నాము. సంక్షేమ రాజ్యాన్ని వెలయించుకోబోతున్నాము. వర్ణవిరహిత సమాజాన్ని రూపొందించుకో

బోతున్నాము. అసమత్వాలకు తావులేని వ్యవస్థను ఏర్పాటు చేసుకోబోతున్నాము. సర్వమానవ సమతను సంఘటించు కొంటున్నాము. వివాహాల విషయంలో స్త్రీల ఆస్తిపాస్తుల హక్కుల విషయంలో, వారసత్వం హక్కుల విషయంలో సంస్కరణలకు, శాసనరీత్యా రక్షణకు యత్నిస్తున్నాము. స్త్రీల అంతస్తు హెచ్చించ డానికి కృషిసాగిస్తున్నాము. అయినప్పటికీ శాసనం జరిగి నూరు సంవత్సరాలు గడిచిపోయిన తర్వాతకూడా సంస్కృతి కలవారుగా పేర్కొనబడుతున్నవారు నేటికీ వితంతు పునర్వివాహానికి సాహసించలేకపోతున్నారనే సంగతి గమనించకుండా వుండలేము.

1929 లో బాల్య వివాహ నిషేధ శాసనం జరిగిన పిదప వితంతు పునర్వివాహసమస్యలో మార్పు ఏర్పడ్డది. ఇప్పుడు బాల వితంతువుల సమస్యలేదు. అయితే బాల వితంతువైనా, యువ వితంతువైనా సనాతనుల హృదయాలలో జుగుప్స పోలేదు వితంతువుకు, కన్యకు మధ్య వివాహం విషయంలోగాని, తదితర సాంఘిక వ్యవహారాల సందర్భంగాగాని విచక్షణ చూపబడరాదు.

గత నూరేళ్ళలోని భారతీయ సంఘం దృక్పథంలో అపారమైన పరివర్తనం సంభవించినమాట వాస్తవమే గాని పూర్వఛాందసాలు, మౌఢ్యం పూర్తిగా మటు మాయం కాగలిగే పాటిగా ప్రజలలో చైతన్యం వికాసం పొందివుండలేదు.

సంఘ సంక్షేమం అంటే ప్రజల ఆర్థిక పరిస్థితిని చక్కపరచడం మాత్రమేకాదు. దురాచారాలను, మూఢ విశ్వాసాలను అవి ఏరూపంలో వున్నప్పటికీ నిర్మూలించడం కూడా సంఘ సంక్షేమమే కాగలదు. సంఘం అంతస్తును మరొక మెట్టు పైకి గొనిపోయే కృషికి సంఘ సంక్షేమం అనేది మరొక పేరు. ఈ కృషి క్రమ బద్ధంగా, తప్పనిసరిగా జరగవలసివుంది.

శాసనరీత్యా హిందూ వితంతువులకు కలిగిన విమోచనం శతవార్షిక దినం యిప్పటికీ సంఘంలో కొందరి హృదయాలను కప్పివున్న సంకుచితత్వాన్ని రూపుమాపి, మానవ జాతికి న్యాయం సుసంఘటితం చెయ్యడానికి వీలుగా సంఘాన్ని ఆవరించిన దురాచార మేఘాలను తొలగించి, చైతన్య జ్వాలా విభాసితం కావడానికి మనం మరింత దీక్షతో, దృఢసంకల్పంతో పాటుపడడానికి ప్రేరేపించవలసివుంది.

---

# హితకారిణీ సమాజం

రాజమండ్రి :: తూర్పుగోదావరి

స్థాపితము 1907

(రిజిష్టర్డు)

స్థాపకులు : రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులు, అధ్యక్షుడు : శ్రీ నాళం కృష్ణారావు, కార్యదర్శి: శ్రీ యానంరెడ్డి వెంకటరావు.

ఆశయములు : వితంతువులకు ఆశ్రయములు, అనాథ ఆశ్రమములు, రక్షకస్థానములు, బాలబాలికల విద్యాలయములు, పారిశ్రామిక, సాంకేతిక కళాశాలలు ఇంకా ఇట్టి ఇతర విద్యావిషయక సమాజముల స్థాపించి నడుపుట.

కార్యక్రమములు : ఈ సమాజము, వితంతుశరణాలయము, థియోసాఫిక్ హైస్కూలు, థియోసాఫిక్ లైబ్రరీ, ప్రార్థనా సమాజం, మ్యూజియంకూడ నడుపుచున్నది.... శరణాలయములోని వితంతువులకు హైస్కూలునందు క్రమవిద్యాశిక్షణ ఈయబడుచున్నది. కొద్దిగ వయసు మళ్ళిన వితంతువులకు ప్రైవేటుగ విద్యాబోధన జరుగును. నూలు వడకుట, నవారునేత, లేసు అల్లికలలో అందరకు తర్ఫీదు ఈయబడుచున్నది. రక్షణాలయము, అగతి ఆశ్రమము, బాలికాపాఠశాల, ధనాభావం వలన మూసివేయబడినా ఇటీవలే తిరిగి కోలుకొని తెరువబడినవి.

ఆర్థిక స్థోమత : మొత్తము సాలుసరి రాబడి. రూ. 6,600 లు/ ఖర్చు. రూ. 17,300. ఇళ్ళ అద్దెలు, భూములు, తోటల శిస్తులు, సభ్యత్వ చందాలునుండి ఆదాయమున్నది. ఇదికాక కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ స్త్రీ సంక్షేమ సంస్థలు స్థాపించటానికి రూ. 10,000 లు/ విరాళము యిచ్చెను.

సంస్థలోని ఉద్యోగస్థులు, ఒక ఆనరరీ కార్యదర్శి. కరెస్పాండెంటు, వేతనములు తీసుకొనే, 52 రు కలరు. ప్రార్థనా సమాజములో ప్రత్యేకము ఒక ఆనరరీ కార్యదర్శికలరు. సమాజ గరిష్ఠ సంఖ్య 108. ప్రస్తుతము 66 మంది మాత్రమే సమాజములో నున్నారు.

# మేము స్నేహంచేసిన నౌకరులు

శ్రీ ఎం. ఎస్. సబ్బరివాల్

ఇళ్ళల్లో పనిచేసే నౌకరులు, వీథులలో ఆలనపాలనలులేక అల్లరి చిల్లరగా తిరుగుతూవుండే పిల్లలు – వీరికి భావి అనేదేలేదు. వీరు ప్రతినగరానికి ఒక సమస్యగా తయారైనారు. ఢిల్లీలో ఈ వ్యాస రచయిత కొందరు మిత్రులతో కలిసి ఈ సమస్యా పరిష్కారానికిచేసిన కృషినే ఈ వ్యాసం వివరిస్తుంది.

నేను ఢిల్లీలో నివసించ నారంభించినది 1952 ఆగస్టులో. నేను సాధించిన కార్యాలూ, నా మనోవైఖరీ నాకే అసంతృప్తి కలిగించాయి. నా తత్వాన్ని మరింత క్షుణ్ణంగా గ్రహించాలని నాకు తట్టింది. అమెరికా, బ్రిటన్‌లలోని మెంటల్ అండ్ మోరల్ హైజిన్ సంస్థలు ప్రచురించిన కొన్ని పుస్తకాలు, కరపత్రాలు తెప్పించి చదివాను. ఆ సంస్థలు ఏమేమి కనిపెట్టినదీ గ్రహించినాను. అయితే అది సిద్ధాంత పరిశీలనమాత్రమే. నా పరిస్థితిలోని పూర్వాపరాలను ఒక్కసారి స్థిమితంగా సమీక్షించుకోగా మాంచి యౌవనోత్సాహంతో తొణికిస లాడే నాస్వభావం ఏవిధంగా విప్లవాత్మకంగా మారి చెడు త్రోవకు లాగి బూజుపట్టిపోయిందో జ్ఞప్తికి వచ్చింది. ఆ అలవాట్లన్నీ ఎలా సంక్రమించాయా అని యోచించు కొన్నాను. చలన చిత్రంలో వలె నా బాల్యదశలోను, యౌవన దశలోను సంభవించిన సంఘటనలన్నీ కళ్ళకు కట్టినట్లుగా తోచాయి. ఇదే సమయంలో సినీమా రంగంలో చేరాలనే కౌతుకంతో వందలాదిగా యువతీ యువకులు ఏవిధంగా తమ జీవితాలను, భావిని ధ్వంసం చేసుకొన్నదీ కూడా పరిశీలిస్తూ వచ్చాను. ఇల్లు వదలి వెళ్ళినది మొదలు వీరి విషయం వారి కుటుంబాలకు పెద్ద సమస్యగా పరిణమించింది. వారి కుటుంబాలతోపాటు వారే ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసివచ్చింది. వారికి జీవితమే నిరాశగాతోచింది.

మేము నివసిస్తూన్న పరిసరాలలో అనేక మంది కార్మికుల బిడ్డలు వుండేవారు. ఆ పరిసరాలన్నీ మురికి పేటలే. అస్తమానం రోడ్లపై పడివుండే సిగరెట్ పీకలను కాల్చేవారు ఆ దారిని బడికిపోయే పిల్లలతో కయ్యాలు పెట్టుకునేవారు. భవిష్యత్తులో వారు ఏవిధంగా తయారు కాగలరో నేను ఊహించుకో గలిగేవాణ్ణి. పూల కుండీలు, గాజు కిటికీలు పగలగొట్టడం, ఉతికి ఆరవేసిన వస్త్రాలను దొంగిలించడం వంటి విధ్వంసక చర్యలే వారికి కాలక్షేపంగా వుండేవి. ఇళ్ళపైన, వయస్సు చెల్లిన వారిపైన రాళ్ళు రువ్వడం, అసభ్యంగా మాట్లాడడం—దౌర్జన్యంగా ప్రవర్తించడం వారికి వినోదం. ఇలాగే కొంతకాలం గడిస్తే వీరి దుండగాలు మితిమీరి నేరస్థులుగా మారిపోగలగడం తథ్యమనే నిర్ణయానికి వచ్చాను. వీరి ప్రవర్తనకు ముఖ్య కారణాలు దారిద్ర్యం, యింట సరియైన తిండి పోషణ, ఆలన పాలనలు లేకపోవడమూ నని గుర్తించాను.

మురికి పేటలలో నివాసం, వినోదం కోసం అల్లరులు, విధ్వంసక చర్యలు జరుపుతూ వుండడం, విద్యాసౌకర్యాలు లేక అలక్ష్యంగా విడిలివేయబడడం, అనారోగ్య, అపరిశుద్ధ వాతావరణంలో ఉనికి-ఇవే బాలురు నేరస్థులుగ మారిపోవడానికి దారితీసే పరిస్థితులు. వీరి పరిస్థితి నాకు అమితమైన ఆందోళన కలిగించింది. మత్తు పదార్థాలను మరిగితే వీరికి యిక విముక్తి అసాధ్యమని తోచింది. ఆ మత్తు పదార్థాలే అనేకమంది ఆరోగ్యాన్ని శిథిలంచేసి, సౌఖ్యాన్ని ధ్వంసంచేసి, జీవితాలను దుఃఖభూయిష్టంచేస్తూన్నందున వీరి చర్యలను అరికట్టి సన్మార్గంలో పెట్టాలని నిశ్చయించుకొన్నాను.

పొరుగునవున్న నా మిత్రులతో సంప్రతించాను. నా చిన్నతమ్ముడు ఈ విషయంలో తోడ్పడ్డాడు. మిత్రులం అందరం ఒక జట్టుగా ఏర్పడ్డాము. మా కార్యకలాపాలు ప్రారంభంకాగానే జాతీయ యువజన సంఘం, ప్రజాస్వామిక యువజన సమితి సభ్యులు కూడా మాతో చేతులు కలిపారు.

స్థానికంగా యిళ్ళలో నౌకర్లుగా వుంటున్నవారిని

# మేము స్నేహంచేసిన నౌకరులు

ఈస్ట్‌పటేల్ నగర్‌లోని ఒక ఎలెక్ట్రిక్ స్తంభానికి దగ్గరగా సమావేశపరచేవాళ్ళం. ముందుగా మేము చేరదీసిన వారిలో యిద్దరు అన్నదమ్ములున్నారు.

మా పొరుగున వున్న యింటిలో వీరిలో ఒకడు వంటవాడు. మరొకడు వడ్డన, యితర పనులు చేస్తూ వుండేవాడు. ఇద్దరు ఎడతెగకుండా పొగ త్రాగేవారు. వీరి యజమాని మద్యపానాసక్తుడేమో, రిఫ్రిజిరేటర్‌లో ఎప్పుడూ కొన్ని విస్కీ-సీసాలు, సారాయము వుండేవి. వీరు మాంచి వయస్సులో వున్నారేమో— యజమాని యింట ఏది దొరికితే అది మ్రింగివేసేవారు. వీరికి కొంచెం హెచ్చుగానే జీతం ముట్టడంవల్ల, యువకులు కావడంవల్ల— తోటి నౌకర్లందరు గౌరవంగాచూసేవారు. అందరు రాత్రిళ్ళు కలుసుకొని, తమ తమ యజమానుల అలవాట్లను గురించి ముచ్చటించుకొనేవారు. వీరితో స్నేహం చేశాను.

"భాయీ ! నువ్వంటే నాకు యిష్టం. మనం నేస్తాలం" అని అంటే చాలు. మనఃపూర్వకంగా ఈ మాట అంటే మంత్రంలా పనిచేస్తుంది. నేను చేసింది అదే రోజూ రాత్రివేళ సమావేశం కావడం వీరికందరికీ అలవాటయింది. వీరి సంఖ్య కూడా హెచ్చసాగింది. 'మీవన్నీ దురలవాట్లు' అని నేను అనకుండా— వారి దృష్టిని భవిష్యత్తుపైకి మరలించేవాణ్ణి. దూరాన ఎక్కడో వున్న తలిదండ్రులు- అక్క చెల్లెళ్లు- వారి మాటేమిటి ? భావి అభివృద్ధి సంగతేమిటి. ఉన్నచోటనే కూపస్థ మండూకాల్లావుంటే ఎట్లా ? ముందుకువెళ్ళాలి. అంతస్తు హెచ్చించుకోవాలి.

ఈ సూచనలు వారి మనస్సులలో గాఢంగా హత్తుకు పోయాయి. చదువుకొనడానికి వారు సమ్మతించారు. మాలో ఒకడు హిందీలో చదువు చెప్పనారంభించాడు. మరొకరు వినోదానికి తగు ఏర్పాట్లుచేసి వారిని పాటలు పాడుకోవలసిందని, ఉత్సాహంగా ఆటలలో పాల్గొనవలసిందని ప్రోత్సహించేవాడు. స్థానిక మహిళా సేవిక ఒకామె వంటపనిలోనూ. వంటగదిని శుభ్రంగా వుంచడంలోనూ, పరిశుద్ధంగా వ్యవహరించడంలోనూ కొన్ని సలహాల నిచ్చింది. ప్రతివాని జీవితచర్యలను, నడవడిని పరిశీలించి, వ్యక్తిగతంగా వారి అభివృద్ధికి తగు కృషి చేసే బాధ్యతను నేను గ్రహించాను.

వీరిలో చందూ బాగా తెలివైనవాడు. విధి విరామాలు లేకుండా పొగ త్రాగేవాడు. మద్య పానానికి అలవాటు పడ్డాడు. చక్కని సిగార్‌లైటర్‌తో అందర్నీ— క్లాసులో కూడా సిగరెట్లు కాల్చమని ప్రోత్సహించేవాడు. ఈ త్రాగుడు మితిమీరి వ్యాధిలోకి దింపిన తర్వాత కుదర్చడానికి పూనుకొనేకంటె ముందుగావారించడమే ప్రయోజనకరం. త్రాగే పదార్థాలు దొరకకుండా చెయ్యడంకూడా ఒక మార్గమే. మత్తు పదార్థం లేకుండానే ఎవరు త్రాగుబోతు కాలేదుగదా ! ఈ అలవాటు ఒక్కసారిగా పట్టుకొనేదికాదు. క్రమ ఘట్టాలలో సాగుతుంది. ముందు సిగరెట్లు కాల్చడంతో ప్రారంభమవుతుంది.

చందు మత్తుపదార్థాలకు అలవాటు పడడం ఏవిధంగా ప్రారంభమౌతుందో చెప్పకు వచ్చాడు.

"నేను పొగత్రాగుతాను. ఎందుకు త్రాగుతాను అంటే సమాధానం ఏమీలేదు. మద్యం త్రాగుతాను. ఎందుకు త్రాగుతావు అంటే యిందుకు అని చెప్పదగ్గ సమాధానమేమీలేదు. మనం ఈ దురభ్యాసాలను విసర్జించాలి. ఈ మత్తు పదార్థాలు మహాప్రమాదకరమైనవి" అన్నాడు.

అతని మాటలను అందరూ హర్షించారు. అందరూ ఆమోదించారు.

చందు విషయంలో మేము జాగ్రత వహించాము. ఆ దురభ్యాసాలు రెండింటికీ అతడు స్వస్తి చెప్పాడు. ముందు పాలిపోయినట్లు కనిపించాడు. అయినా తన పట్టుదలను విడువలేదు. పొగ త్రాగడం, మద్యపానం రెండూ అతడు మానివేయగానే మిగిలిన స్నేహితులందరు కూడా అతని అడుగు జాడలలోనే నడవడానికి వాగ్దానం చేశారు. వీరిలో చాలామంది దారిద్ర్య పీడితమైన కొండప్రాంతాలు —కెంగ్రా, కానోమి, అల్మోరా, ముస్సోరీల నుంచి వచ్చినవారు. వీరిలో చాలామంది తలిదండ్రులతో చెప్పకుండానే యిళ్ళు వదలి వచ్చినవారు. అందరిని గురించి ప్రత్యేకంగా పరిశీలించే అవకాశం మాకు లభించింది. తలిదండ్రులకు తమ ఉనికిని గురించి వ్రాయాలని, ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ వుండాలని మేము నచ్చచెబుతూ వచ్చాము. మా యీ కృషి ఫలించింది. ఇప్పుడు ఏనౌకరైనా ఏ వీథిమొగ దగ్గరనో కనిపిస్తే తాను స్వస్థలానికి వెళ్ళి బంధువులతో కొన్ని రోజులు కులాసాగా గడిపి వచ్చానని చెబుతాడు.

# మేము స్నేహంచేసిన నౌకరులు

ఈ విధంగా పరిస్థితి చక్కబడ్డ నౌకరులు అనేకమంది బాలుర సమస్యను పరిష్కరించడంలో సాయపడ్డారు. వీధుల్లో అల్లరి చిల్లరిగా తిరిగే పిల్లలను ముందు చేరదీసి తగవుపడరాదని చెప్పేవాళ్ళం. వాళ్ళను ప్రేమగా, సాదరంగా పిలవడంతో వారు ఎంతో చక్కగా దగ్గరకు వచ్చి మా మాటలను ఆలకించేవారు. వీరికి ఆశ్రయం కలిగించడానికి ఒక సంస్థ, సాయం చెయ్యడానికి డబ్బు లేకున్నప్పటికీ వారికి ఉపయోగకరములైన మార్గాలను కనుగొనగలిగాము.

నాకు జోళ్ళు పాలిష్ చెయ్యడం బాగా తెలుసు. అది నేను ఒక పెద్ద సైన్యాధ్యక్షునివద్ద నేర్చుకొన్నాను. ఫర్నిచరును, నేలను పాలిష్ చేసే పద్ధతికూడా నేను నేర్చుకున్నాను. వీధులలో తిరిగే ఈ పిల్లలందర్ని నా స్నేహితులు ఒకనాటి మధ్యాహ్నం సమావేశపరిచినపుడు నేను ఈ విద్య వారికి ప్రదర్శించాను. వారంతా ఈ జోళ్ల పాలిష్ పని ద్వారా ఎలా సంపాదించుకోగలరో వివరించాను. వారికి ఆసక్తి కలిగింది. అందరు నేర్చుకొన్నారు.

అందరికీ ఒక్కొక్క బ్రష్, పాలిష్ డబ్బా, నీళ్ళు పోసుకొనే సీసా, ఒక తెల్లని గుడ్డముక్క ఒక్క నెల లోపుగా సమకూర్చ గలిగాము. వారు సంపాదన మొదలు పెట్టారు. కొన్ని రోజులలోనే కొందరు రోజుకు మూడు నాలుగు రూపాయలవరకు కూడా సంపాదించసాగారు. వీరిలో కొందరు పొగత్రాగేవారి అలవాటు మాన్పించ డానికి కూడా కృషి చేసేవారు.

'బాబూ! చిన్నిని ఓసారి కొట్టండి వాడు ఇంకా పొగ త్రాగుతున్నాడు' అని చెప్పేవారు. నాకు నేడు మోహన్ కనిపించాడు. 'మమ్మల్ని రక్షించారు బాబూ! మీ జోడు పాలిష్ చెయ్యనివ్వరూ? కాలూ, చిన్నా, పమ్మా, రాము, సురిందర్— అందరము మీకు ఋణపడివున్నాము బాబూ! మీరు సాయం చెయ్యకపోయివుంటే మేము యింకా అడుక్కుంటూనే వుండేవాళ్ళం. పోలీసులు, మునిసిపల్ ఉద్యోగులు పెడుతున్న చర్యలనుంచి కాపాడండి బాబూ" అని చెప్పాడు. మాకు ఈ మాటలు ఎంతో సంతోషం కలిగించాయి.

వీధులలో అల్లరి చిల్లరిగా తిరిగే బాలురకు ఆశ్రయ మిచ్చే సంస్థలకు మేము సర్వవిధాల సహకరించగలము. ఇటువంటి పిల్లల పరిస్థితిని చక్కబరచవలసినదని అంద రకూ విజ్ఞాపన చేస్తున్నాము. మనకు పూలకుండులన్నా, ఇళ్ళు అన్నా యిష్టం. ఇంటి గోడలమీద ఎవరైనా బొమ్మలు వేసి, కల్లి బొల్లి రాతలు వ్రాసినా నొచ్చు కుంటాము. ఆలన, పాలన లేని యిటువంటి పిల్లలు చేసే పనులను వారించగలిగితే, మనం మనజాతి నెదుర్కొంటున్న అనేక సమస్యలను పరిష్కరించినట్లు. ప్రతి యువకుడు కూడా తాను వున్న పరిస్థితినుంచి పైకి రావడానికి, తన ప్రతిపత్తిని హెచ్చించుకోడానికి, తాము సాధించే కార్యాలను యితరులు గుర్తించాలని కోరు కొనడం సహజం. మనం చేసే ఏపనినైనా సంఘం గుర్తిస్తే అది ఆత్మవిశ్వాసాన్ని రేకెత్తిస్తుంది. ఎవరికైనా సరే సంఘ పరిగణన అపూర్వమైన ఆనందాతిశయా న్నిస్తుంది. సంఘం నిరసిస్తే ఎవరైనా క్రుంగిపోతారు. సాధించిన స్వల్ప విజయాన్ని అయినా యితరులు మెచ్చు కొనడం మరింత ఘనకార్యాలను నెరవేర్చడానికి ప్రోత్స హిస్తుంది. ఇతరుల విమర్శ నిరుత్సాహపరుస్తుంది. మానవులపట్ల సౌహార్దాన్ని, ప్రేమను మించిన మందు లేదు. విద్యావంతుడైన ప్రతి భారతీయుడు జోళ్ళు పాలిష్ చేసే పిల్లల పట్ల, నౌకరుల పట్ల, వీధులలో తిరిగే బిడ్డలపట్ల ప్రేమ చూపాలి. డబ్బుతో దీనికి నిమిత్తం లేదు. సానుభూతి, సానుతాపాలే ముఖ్యం.



# కుసుమ్

## శ్రీ హేమేంద్ర కుమార్ రాయ్

ఆమె పతిత. క్షణికదౌర్బల్యంమూలంగా పతితకాలేదు. విధివ్రాలును బట్టే పతిత అయింది. బురదనీటిలో కలువ పూవులా ఆమె వికసిస్తూ వుంది.

సంజవేళ ఆమె డాబామీద కూర్చుని వీథివైపు చూస్తూ వుండేది. ఆమె పెదవులపై చిరునవ్వు తోచినా హృదయం ఆవేదనతో కుమిలి పోయేది. ఆ దారిన పోయే ప్రజలు ఆ సౌందర్యరాశివంక రెప్పవాల్చకుండా చూసేవారు. ఘోషా స్త్రీలు కొన్ని ఇళ్ళలో కిటికీ సందులలోనుంచి తొంగి చూస్తూవుండేవారు. వారిదృష్టి తనపై సారించబడినపుడు పవిత్రమైన వారి చూపులు తన్ను నిలువున దహించి వేస్తున్నట్లుగా ఆమెకు తోచేది. లజ్జావమానాలతో ఆమె కృంగిపోయింది. ఈ చెరనుంచి నాకు ముక్తి కలిగించు అని ఆమెలోని స్త్రీత్వం ఆక్రోశించేది.

ఒకనాడు ఆమె అలా కూర్చుని చూస్తూ వున్న సమయంలోనే ఒక పెద్దమనుష్యుడు ట్రాముసుంచి దిగుతూ పడిపోయాడు. ప్రయాణం చేస్తున్నవారంతా నిర్ఘాంతపోయారు. డ్రైవరు ఆయన పడిపోవడం చూశాడుకాని వేగంగా బండిని పోనిచ్చాడు.

ఆ వృద్ధునిశిరస్సు రాయికితగిలి గాయమైంది. స్పృహ తప్పి పడిపోయాడు. జనం చుట్టు మూగారు.

"పాపం! రక్తం కారుతోంది" అని ఒకరన్నారు.

"బ్రతికేవున్నాడా?"

"ఆ! ఇంకా ప్రాణం పోలేదు"

"ప్రాణం పోక పోతే యిప్పుడు పోవచ్చు. త్వరలోనే పోలీసులు వస్తే సాక్ష్యం వేస్తారు. పోదాం రా."

ఈ గందర గోళం అంతా కుసుమ్ చూసింది. అక్కడ వున్న వారిలో ఒక్కరూ ఆయనను లేవదీయలేదు.

ఇంక ఆమె సహించలేక పోయింది. చర చర క్రిందకు దిగి గుంపులో త్రోవచేసు కొంటూ వెళ్ళింది.

ఎవరైనా దయవుంచి ఈయన్ని మాయింటిలోకి చేరుస్తారా? ఇలా ఇక్కడే వుంటే ప్రాణం పోవచ్చు" అంది కుసుమ్. ముగ్గురు నలుగురు ముందుకు వచ్చారు.

"ముసలాయన ఆమెకేమౌతాడు?" ఎవరో అన్నారు?

"తెలివితక్కువవాడా! ఏమౌతాడో గ్రహించలేవూ?" అన్నారు మరొకరు.

ఎవరో నవ్వారు. అయితే ఆమె ఈ మాటలను లెక్క చెయ్యలేదు. నలుగురు ఆయనను లోపలకు సాయంపట్టేరు

"అటువంటివ్యక్తి సపర్యచేసేటట్లయితే నేను రోజుకు రెండువందల సార్లయినా ట్రాము నుంచి క్రిందకు పడగలను". అన్నాడు మరొకడు ఆమె వెనకనుంచి.

ఆరాత్రి, మరునాడు గడచేయి. ఆయనకు స్పృహ రాలేదు. కుసుమ్ సపర్యలుచేస్తోంది. చివరకు భోజనమైనా చెయ్యలేదు. తనచీరకొంచెంచించి గాయానికి కట్టుకట్టింది.

ఆ మేడ క్రిందివాటాలో కాపరంవుంటున్న డాక్టరును పిలిచింది. ఆమరునాడూ ఆ పెద్దమనిషి కన్నుతెరవలేదు. ఒళ్ళు సల సల క్రాగుతోంది జ్వరంతో. కుసుమ్ కంగారు పడ్డది. మరోపెద్ద డాక్టరును పిలిపించింది

విదేశాలలో పరీక్షలుపాసైన ఆడాక్టరు "ఆయనపరిస్థితి తీవ్రంగా వుంది" అన్నాడు. ఆమె ప్రశ్నార్థకంగా చూసి "ఏమౌతుంది?'' అంది.

"కొంచెం జాగ్రత్తగా పరిచర్యలు చేస్తేసరి" అన్నాడు

ఆమె అతని ఫీజు తెచ్చియిచ్చింది. ఆ నోట్లనులెక్కపెడుతూ "ఆయన నీకేమౌతారు?" అడిగారు డాక్టరు.

ఆమె వూహుకొంది. "ఓహో! నీ...''

"అ! ఆగండి. ఆయన నాకు ఏమీకారు" అంటూ జరిగినదంతా వివరించింది. డాక్టరు ఆలోచించాడు.

"ఆయనను వెంటనే ఆసుపత్రిలో చేర్పించు. ఏంజరిగినా నీకేమీ బాధ్యత వుండదు" అన్నాడు.

"ఆయనకు ఎప్పటికి స్పృహ వస్తుంది?"

"రాత్రికి రావచ్చు అయినా చెప్పలేము. నేను యింక వెడతాను" అంటూ ఆ డాక్టరు ఆమె యిచ్చిన డబ్బు తిరిగి యిచ్చి వేయబోయాడు.

"ఏమి? ఫీజు తీసుకోరా?" "ఉహూ! వద్దు."

కుసుమ్ ఆందోళన పడ్డట్టుగా చూసింది. అతడు ఆమె మనోగతాన్ని గుర్తించినట్లుంది. చిరునవ్వుతో ఆ రూపాయలను అక్కడే వదిలివేసి వెళ్ళిపోయాడు.

"ఎంత దౌర్భాగ్యపు పుట్టుకో నాది." అని ఆమెబాధ.

ఆరాత్రి ఆ పెద్దమనిషికి స్పృహ వచ్చింది. "అయ్యో నా గుండెల్లోమంట, కాసిని నీళ్ళు" అన్నాడు ప్రక్కకు ఒత్తిగిలి.

కుసుమ్ ఒక గ్లాసుతోనీరు త్రాగించింది. ఫాలభాగాన్ని తన చేతితో నిమిరింది.

"అయ్యో గుండెల్లోమంట" అన్నాడు ఆయన తిరిగి. కుసుమ్ గుండెలను కూడా నిమిరింది. ఆయన కళ్ళు తెరచిచూశాడు. కుసుమ్ మళ్ళీ మంచినీరిచ్చింది.

"ఎవరు? మా సుధవా?"

"కాను. ఎవరో అభాగ్యురాలను."

"ఇంకా మేలుకొన్నావా నా చిట్టి తల్లీ" అంటూ ఆయన తిరిగి కళ్ళుమూసు కొన్నాడు.

"నా చిట్టి తల్లీ అన్నమాట ఆమెకు అమృత మధురంగా తోచింది. ఆయనకు తాను కుమార్తె అయినట్లుగా భావించుకొంది. తండ్రిప్రేమను ఆమె ఎరుగనే ఎరుగదు ఆ అనుభూతి ఆమెకు కరువైంది.

"కుసుమ్ ! కుసుమ్ ! తలుపుతియ్."

ఆ మాటలు ఆయన వింటాడేమో. వెళ్ళి తలుపుతెరచి "పో ! మళ్ళా కుసుమ్ అని పిలిచావంటే చీపురు తిరగేస్తాను." అంటూ తలుపు గభాలున మూసివేసింది.

ఆ మరునాడు ఉదయమే తనకు యిష్టం లేకున్నా ఆస్పత్రిలో ఆయనను చేర్చింది ఆయన కుటుంబానికి ఈ సంగతి తెలిసి ఆసుపత్రికి వచ్చి చూశారని కుసుమ్‌కు తెలిసింది.

మూడు నాలుగురోజులు గడచిపోయాయి. ఆయనకు స్వాస్థ్యం చిక్కిందని, ఆ మరునాడు ఆస్పత్రి నుంచి డిశ్చార్జి చేస్తారని తెలిసింది. అమ్మయ్య ఆమె హృదయం నుంచి ఏదో భారం తొలగి నట్లయింది. ఒకసారి వెళ్ళి చూడాలనుకొంది, వెళ్ళింది.

నౌకరు ఆమెకు ఆయన గది చూపించాడు. మేలి ముసుగు ముందుకు లాక్కొని ఆమె తలుపు త్రోసుకొని లోపలకు వెళ్ళింది.

రాలు- ఒక యువకుడు కూర్చుని వున్నారు. ఆ యువకునితో ఆయన ఏమో మాట్లాడు తున్నాడు.



"నాయనా ! నన్ను గుర్తించలేరా?" అంది.

"ఆఁ ! నాకు జబ్బుగా వున్నప్పుడు చూసిన జ్ఞాపకం"

"మీరు ట్రామునుంచి పడిపోతే మా యింటిలోకి తీసుకు వెళ్ళాను. రెండు రోజులున్నారు.

"ఆఁ ! మీ యింట్లో వున్నానా? వెంటనే కర్కశంగా "నువ్వు కులటవు. నీచేతినీరుత్రాగి భ్రష్టుణ్ణయినాను. పాపిష్టిదానా? ఎందుకు వచ్చావు?"

కుసుమ్ నిర్విణ్ణు రాలైంది. ఆమె నోటమాటరాలేదు.

"చెప్పు ! బహుమతి కోసం వచ్చావా?"

కుసుమ్ సగర్వంగా తలపైకెత్తి 'అవును' అంది.

తలగడా క్రిందనుంచి ఓ పదిరూపాయల నోటు తీసి ఆయన తృణీకారంగా ఆమెపై గిరవాటు వేశాడు.

ఆనోటుతీసుకొని ఎవరిని చూడకుండా వెళ్ళిపోయింది.

కుసుమ్ వీధిలోకి రాగానే ఒక బిచ్చగాడు "తల్లీ ! ఏమైనా ..."అన్నాడు. ఆమె ఆ పదిరూపాయల నోటును ఆబిచ్చగానికి చేతిలోపెట్టింది.

అయితే ఆ మాటలు ఆమెకు వినిపించలేదు. ఆమె నీలాకాశంవైపు నిర్నిమేష నేత్రాలతో చూసింది.

(బెంగాలీనుంచి అజిత్ ముఖర్జి అనుకృతి)

# గంగ

శ్రీమతి సావిత్రి గోయెల్

తాను ఏది చెయ్యదలచుకొంటే అది చేసి, ఏది కావాలనుకొంటే దానిని పొందగలిగిన తన చిన్నతనపు రోజులు జ్ఞాపకానికి వచ్చినపుడు గంగ మనస్సు కొంత వ్యథితం కాకపోలేదు. అది పెక్కు సంవత్సరాలనాటి సంగతి, తనకు ఆరేళ్ళయినా నిండని సమయంలో మరణించిన తల్లి ముఖం యిప్పుడు ఆమెకు జ్ఞాపకంలేదు. ఆమె తండ్రి మరొక పెళ్ళి చేసుకొన్నాడు. అయితే సవతితల్లి 'చావకొట్టి చెవులు మూసే' కథ కాలేదు గంగది. ఆమె చాలా మంచిది. ఆమెను ఎంతో ప్రేమతో చూసేది. ఆ ప్రేమ మితిమీరిన ప్రేమ. మరీ ఎక్కువ శ్రద్ధాసక్తులతో పెంచేది. ఏది కావాలన్నా మారాము పెట్టవలసిన పనిలేదు. ఏది కోరితే అది యిచ్చేది. అయితే ఎప్పుడూ శుభ్రంగా వుండాలి.

పెద్దదైన పిదప ఆమె మరింత ఎక్కువ కట్టుబాట్లకు లోబడవలసి వచ్చింది. ఆమె తోటి పిల్లలలో చాలా మందికి బడి అంటే భయంకలిగేది. కాని గంగకు అలా కాదు. ఆమెమిక్కిలి శుభ్రంగావుండే దుస్తులను ధరించేది. కావలసిన పుస్తకాలు, పెన్సిళ్ళు కొనుక్కొనేది. తోటి పిల్ల లందరిలోను మణిపూసలా వుండేది. ఆమె నిర్భయత్వం, సాహసం, ధైర్యం అందరకు అబ్బురపాటు కలిగించేవి.

“గంగా ! కాళ్ళు అల్లా ఊపకూడదు. అది తప్పు. . . అలా గట్టిగా మాట్లాడకూడదు. అది దురలవాటు— ఇష్ నీరు త్రాగేటప్పుడు అలా ధ్వని చెయ్యకూడదు. నువు మరో యింట వుండబోతున్నావు. అక్కడ మీ అత్తగారికి యిటువంటివి నచ్చకపోవచ్చు . . . అదిగో మీ తమ్ముడు చేసినట్లు అలా అనుకరించకూడదు. . . ఆడపిల్లలు కలకాలం పుట్టింటనే వుండరు. మరో యింటికి వెడతారు. . .”

“అబ్బ ! ఏం మరోయిల్లు. నేను వెళ్ళను ఏయింటికీ” అంటూ గంగ కోపంతో పరిగెత్తేది. ఆమె తలిదండ్రులు “రత్నంలాంటి పిల్ల. అయితే స్వభావం మాత్రం కొంచెం దురుసుతనం వుంది” అని నవ్వుకొనేవారు.

“తనకు తోచినంత చెయ్యాలి. ఇదే అత్తవారి ఇళ్ళలో చిక్కు తెస్తుంది పిల్లలకు ”

గంగ భర్త చదువుకొన్నవాడే అయినా, జమీందారీల రద్దుకు, తన తండ్రి మరణానికి పిమ్మట స్వగ్రామంలోనే నివసించేవాడు. ఉన్న భూమిని కవులుకిచ్చి ఎక్కడనో వుండేరోజులు చెల్లిపోవడంతో మిగిలిన భూమిని అట్టే పెట్టుకొనడం కోసం స్వంతంగా వ్యవసాయం చేసుకోవలసివచ్చింది. అత్తగారు ఆమె తన మనస్సులో రూపొందించుకొన్నటువంటి రాకాసికాదు. ఆమె వేషధారణలోగాని, నడకలోగాని, తిండివిషయంలోగాని ఏ తప్పూ పట్టేదికాదు. ఇంటిలో సర్వాధికారం ఆమెకిచ్చింది. ఆమెనే గృహలక్ష్మిగా చేసింది. తన తల్లే అన్ని స్వల్పవిషయాలలోను ఎంతో గందరగోళం చేస్తూ వుండేది. ఇక్కడ ఈయింటికి ఆమె దేవత. తన సౌందర్యంతోను, సద్గుణాలతోను భర్తను అలరించేది.

అయితే త్వరలోనే గంగ అనుమానాలన్నీ నిజం కాసాగినై. ఆమె అత్తగారు అందరిలాగే క్రొత్త కోడలు యిల్లు వదిలి వెళ్ళరాదనేది. పెద్దలు నిర్ణయించిన ఆచార, సంప్రదాయాలన్నింటినీ మన్నించాలనేది. పెళ్ళినాటి మేలిముసుగు అందాన్ని ఇనుమడింపజేయడానికి, యితరుల దృష్టి సారించబడకుండా వారించడానికి మాత్రమేకాదని, ఆ అవకుంఠనం లక్ష్యం నైతిక రక్షణమేనని ఆమె అభిప్రాయపడేది.

ఇప్పుడు తన సవతితల్లి యిచ్చిన శిక్షణ అంతా అనవసరంగా తోచసాగింది. 18 ఏళ్ళపాటు తన కామె బయటకు వెళ్ళడానికి ఎందుకు స్వేచ్ఛ నిచ్చినట్లు ? ఎందుకు బడికి పంపి పరీక్షలన్నీ ప్యాసు చేయించినట్లు ? ఎందుకు తన్ను బాల్యంనుంచి కూడా తనలోని ప్రత్యేక వ్యక్తిత్వాన్ని గుర్తించే అవకాశం లేకుండా ఘోషాలో అట్టేపెట్టలేదు ? తను మరెవరిమీద ఆధారపడవలసినపని లేకుండా ఎందుకు యింటిలోనే తనను అట్టేపెట్టలేదు ?

ఈ ప్రశ్నలన్నీ ఆమెను వేధించసాగాయి. నడిచిపోయిన ప్రతీఘట్టంకంటె ఆ తర్వాత ఘట్టం మరింత బాధాకరంగా వుండేటట్లు కనిపించింది. తన తలిదండ్రుల యింటికీ పోవాలనిపించింది. తన సవతితల్లి ఎంతో స్వేచ్ఛనిచ్చింది. తన ధైర్యాన్ని తండ్రి ఎన్నోవిధాల ప్రశంసించేవాడు. ధర్మాధర్మ విచక్షణశక్తిలేని అజ్ఞులే అదృష్టవంతులు.

కాలచక్రం గిర్రున తిరిగిపోతున్నది. ఏళ్ళు గడిచి పోతున్నవి. కలిసిమెలిసివుంటేనే సామరస్యం హెచ్చు తుందని చెబుతారు. అయితే యిక్కడ ప్రతీ ఘర్షణ అభిప్రాయభేదాలకు మరింత స్పష్టంగా నిరూపించ సాగింది. ఆదిలో ఆ గ్రామం ఆమెకు కొత్త. ఎప్పుడూ యింట్లోనేవుండేది. ఆ తర్వాత క్రమంగా అందరితోను పరిచయం ఏర్పడింది. వారి యిళ్ళకు వెళుతూవుండేది. నిర్బంధాలు హెచ్చిన కొలదీ ఆమె చేస్తున్న నేరాలు ఎక్కువౌతున్నట్టు కనిపించసాగింది.

వారి గ్రామం కమ్యూనిటీ ప్రాజెక్టులో చేర్చబడింది. ప్రాజెక్టు నిర్వాహణాధికారులు ఆమె భర్త తమకు అభివృద్ధి కార్యక్రమంలో తోడ్పడగలడనుకొన్నారు. సాంఘిక విద్యా కార్యక్రమ నిర్వహణకు ఉద్యోగిగా నియుక్తురాలైన ఒకామె వీరి యింటికికూడా వచ్చింది. చదువు, సంస్కృతికల యువతి యిక్కడ కనిపించడం ఆమెకు ఎంతో విస్మయంచేకూర్చింది. గంగను గ్రామ సేవిక కావలసిందని సలహాయిచ్చింది. దీనికి గంగ వెంటనే అంగీకరించింది.

ఇంటిలో కలకలం రేగింది. కోడలు ఊరంతా తిరగడమా? ప్రజల కంటపడడమా? పెద్ద కుటుంబాల్లో యిటువంటిది ఎప్పుడైన ఎక్కడైనా జరిగిందా? గంగ గ్రామ సేవికగా నియోగించబడిందేకాని ఆమె యిల్లువిడిచి వెళ్ళడానికి వీలేలేకపోయింది నెలరోజులు గడిచిపోయాయి. ఆమె ఏమీ చెయ్యలేదు. ఎవరితోను మాట్లాడేదికాదు. భర్తతోకూడా ముభావంగా వుండేది. నిరంతరం ఏదో ఆలోచనలో మునిగిపోయేది. ఆమెలో రేగుతున్న అశాంతిని అందరు గ్రహించగలిగారు.

ఊహుఁ! తను ఇంటిలో బందీగా వుండడమా? తన పేరు గంగకదా? కొటానుకోట్ల ప్రజలకు సంతోషం కలిగించేది గంగ. తాను మూర్తీభవించిన పవిత్రతకాదా? తన భర్తనడిగింది. తన చర్యలకు ఎప్పుడూ అభ్యంతరం చెప్పబోడనే వ్గాసం పొందింది. తాను సంఘ సేవికకావడానికి నిర్ణయించుకొంది. ఆ నిర్ణయం ఆమె మనస్సుకు శాంతినిచ్చింది.

"నేను వెడుతున్నాను" గంగ భర్తతో చెప్పింది.

'ఎక్కడికి?' అని సాశ్చర్యంగా ప్రశ్నించాడు. బల్ల దగ్గర కూర్చుని ఏవో కాగితాలు చూసుకొంటూ.

"తానాపూర్ మహిళా శిక్షణ కేంద్రానికి. మీకు యిష్టంలేకపోతే యిక తిరిగి యిక్కడకురాను" అంది. ఆమె పలుకులలో దృఢనిశ్చయం ప్రతిధ్వనించింది. తనకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కావాలి. ఈవిధంగా తాను బ్రతకలేదు. అత్తగారన్నా, భర్త అన్నా, యిల్లు అన్నా ఏవగింపు కలిగింది. ఇంతకాలం లొంగిపోయి వున్నందుకు తన యెడల తనకే ఏవగింపు జనించింది. ఈక్షణంలో గంగ ఆ సంకెళ్ళను వదలించుకొంటూవుంది మరణానైనా లెక్కచెయ్యకుండా.

తృటిలో ఆమె భర్త ఆ మాటలలోని యాదార్థ్యాన్ని గ్రహించాడు. ఆమెవంక శాంతంగా చూశాడు. ఆ అందంలో ఆమె ఉజ్వలంగా భాసిలుతూవుంది. ఆ నిర్ణయం ఆమె ముఖానికి చిత్రమైన నవ్యతను తెచ్చిపెట్టింది. నవయౌవనోన్మిషితమైన ఆమె మూర్తిలో దీక్ష, దక్షత గోచరించాయి. ఆమె ఒంటరిగా ప్రపంచాన్ని ఎదుర్కొనడానికై తాను వదిలివేయవలసినదేనా? ఆమెను వినాశంచేసి తానుకూడా వినాశం కావలసిందేనా?

"ఇదిగో! నీకు మనియార్డర్ ...."

"ఏం చేశానని నాకు ఆ డబ్బు? నాకు నిజంగా డబ్బు కావాలా?"

అయితే ఈ మాటలు ఆమె భర్త వినలేదు. అతడు తొందరగా ఆలోచిస్తున్నాడు సాధకబాధకాలను

ఈ చర్య మంచికే వచ్చిందా? చెడ్డకు దారితీస్తుందా. ఇదిగో డబ్బు. డబ్బు సంపాదన అంటే తల్లికికూడా సమ్మతమే. గ్రామంలో తనకుమల్లె స్థితి పరులైన భూస్వాములున్నారు. వారికి సమస్తమూ వుంది. కాని రొఖం లేదు. దానితో తనతల్లిని తృప్తిపరచవచ్చు.

అతని హృదయంలో సంఘ విద్యాధికారిణి రంజన మెరిసింది.

ఆమె అవినీతి పరురాలా? గౌరవం లేనిదా? కాదు. ఆమెకు గౌరవం, ప్రతిష్ట, నీతి అన్నీ వున్నాయి. అధికారులతో ఆమె ఎంతో చక్కగా మాట్లాడుతుంది. ఒకనాడు తన భార్య కూడా అలాగే మాట్లాడగలదు. ఆమె కూడా ఎందుకు సాంఘిక విద్యాధికారిణి కారాదు? ప్రయత్నం చెయ్యడమే తరువాయి.

ఉన్నట్లుండి తరతరాలుగా హృదయాన్ని క్రమ్ముకుని వున్న భారాన్ని విదలించుకోగలిగాడు.

"వెళ్ళు. నిన్ను మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను. ఈ రోజునుంచి నీ యిష్టానుసారంగా చెయ్యవచ్చు" నన్న పలుకులు అతని నోట వెలువడినై.

ఆ క్షణంలో తన యావజ్జీవ సహధర్మిణిని ముఖాముఖీ సర్వ స్వతంత్రురాలుగా అవలోకించ గలిగిన స్వతంత్ర పురుషుడతడు.

# విజయ బాల సంఘం

## సౌత్ బజారు వీధి, మదనపలి.

స్థాపితం :

1952.

వ్యవస్థాపకులు :

శ్రీ ఎమ్. పాండురంగం.

పరిపాలనాధ్యక్షుడు :

శ్రీ పి. రంగనాథం.

కార్యదర్శి :

శ్రీ ఆర్. భవానీశంకర్.

ఆశయములు :

అన్ని తరగతుల శిశువులకు విద్యా సాంఘిక సాంస్కృతి కాభివృద్ధికి తగన సౌకర్యములను కలుగజేయుట.

కార్యక్రమం :

వ్యాస రచన, చిత్రలేఖనము, వక్తృత్వము, బొమ్మలు గీయుట, సంగీతము మొదలగు వాటిలో శిక్షణ ఇచ్చెదరు. ఈ సంఘమున పిల్లల సభలు, వక్తృత్వపు పోటీ సభలు, నాటకములు ప్రదర్శించుతారు. పిల్లలను వివిధ విహార ప్రదేశములకు తీసుకు వెళ్ళి, ఉత్తమ పౌరులుగా తయారయ్యేట్టి శిక్షణ ఇస్తారు.

ఆర్థికస్థోమత :

సరాసరి సాలుకయ్యే ఖర్చు రు 900 లు. సంఘపు రాబడి విరాళముల నుండి పొందినదే.

అనుబంధము :

ఈ సంఘము మద్రాసు ఆంధ్ర బాలానంద సంఘపు అనుబంధము.

గమనిక :

సంఘ సభ్యుల గరిష్ఠ సంఖ్య 400. ప్రస్తుతము సంఘ సభ్యుల సంఖ్య 300. ఏ వేతనము లేకుండా అయిదుగురు సంఘాభివృద్ధికై పనిచేయుచున్నారు.

— "సోషల్ వెల్ ఫేర్ ఇన్ ఇండియా" నుండి.

# నేనూ, సుమిత్రా

"శ్రీ విజయ''

ఇంటర్వెల్ అయింది. హాల్లోలైట్లన్నీ వెలిగాయి. ఒక్కసారి నాలుగు వేపులా కలయచూశాను. "కూల్ డ్రింక్స్ తాగుదామా" అంటున్న వీరిమాట వినిపించుకోకుండా ముందువరసలో ఒక అమ్మాయిని దీక్షగా చూస్తున్నాను. గులాబీ జార్జెట్ చీరా, బ్లూకలర్ బ్లౌజూ, తల్లో జాజులూ .... ఆ క్షణానే ఆ అమ్మాయి నాకేసిచూసింది. నిమిషంలో జ్ఞాపకం వొచ్చింది. విశాఖపట్టణంలో డాక్టరు రంగారావుగారమ్మాయి సుమిత్ర. ఆరేళ్ళ క్రితంమాట. సుమిత్రకూడా నన్నుగుర్తించిందల్లేవుంది. లేచివొచ్చింది. నా ప్రక్క ఛెయిర్ చూపి "జ్ఞాపకంవున్నానా?" అని పలకరించాను. సుమిత్ర పలువరుస తళుక్కుమనేట్టు నవ్వింది. "ఏమి సుమిత్రా? ఇప్పుడెక్కడుంటున్నారు? అమ్మగారు ఎక్కడున్నారు?" అన్నాను నేనామె చెయ్యి పట్టుకొని. సుమిత్ర "అన్నయ్య యిక్కడే ప్రాక్టీస్ పెట్టాడు. అమ్మా నేను యిక్కడ అన్నయ్య దగ్గిరే వుంటున్నాం. సైలాపూర్ లో యిల్లు కొన్నాడు అన్నయ్య. మనం స్కూల్ ఫైనల్ చదివేప్పుడు అన్నయ్య ఎమ్. బి. థర్డ్ ఇయర్ చదువుతూ వుండేవాడు. జ్ఞాపకం వుందా?" అంది నావేలి వుంగరం చూస్తూ. అది వీరిది సుమిత్ర వొంగి యీయన కేసి చూసి"మీ .."అంది. తలవూపాను. "మాభూషణం కూడా వొచ్చాడు. అడుగో!" అని వాళ్ళన్నయ్యను చూపింది. కూల్ డ్రింక్ తాగుతూ మర్నాడు వాళ్ళింటికి వెళ్ళేట్టు ప్రామిస్ చేయించు కుంది.

ఇంటికి వొచ్చాక ఆ అమ్మాయి ఎవరన్నారు వీరు.

"మీ కెప్పుడూ చెప్పలేదనుకుంటాను. మేం విశాఖపట్టణంలో వుండగా వీళ్ళనాన్నగారు డాక్టరు రంగారావుగారని వుండేవారు. రేండేళ్ళు కాటోలు కలిసి చదివాం. స్కూల్ ఫైనల్ పాసైన ఏడే రంగారావుగారికి నైజాం ట్రాన్స్ ఫరయింది. అమ్మకీ, సుమిత్రవాళ్ళమ్మకీ మంచి స్నేహం. సుమిత్ర మంచి తెలివి తేటలు లేకపోయినా, పట్టుదలా, శ్రద్ధావున్న పిల్ల. కాని భయస్తురాలు. పిరికితనం ఎక్కువ" అన్నాను.

మర్నాడు సుమిత్రవాళ్ళింటికి బయలుదేరాను. సూర్యుడస్తమిస్తున్నాడు. వాళ్ళింటికి చేరేసరికి సుమిత్ర నా కోసం గేట్ లో వెయిట్ చేస్తోంది. నన్ను లోపలహాల్లో సోఫాలో కూచోబెట్టి తను లోపలికి వెళ్ళింది.

సుమిత్ర ట్రేలో కాఫీ తీసుకొచ్చింది. ఇంతలో వాళ్ళమ్మగారు వొచ్చారక్కడికి. "ఏమమ్మా విజయా? అంతా కులాసాగా వున్నారా? అమ్మ ఎక్కడ వున్నారు" అన్నారావిడ. "అమ్మ విశాఖపట్టణంలోనేవుందండీ. నేనిక్కడ ఎకనామిక్స్ లెక్చెరర్ గా వుంటున్నాను" అన్నాను. ఇంతలో సుమిత్ర "మరివారు"అంది. "ఫిజిక్స్ లెక్చెరర్'' అన్నాను నేను ఫ్లవర్ వాజ్ కేసి చూస్తూ. "దాంపత్యం బావుందమ్మా'' అన్నారావిడ పక్కగదిలోకి వెళ్ళిపోతూ. సుమిత్ర మొహంలో బాధ, వ్యధ కనపడ్డాయి నాకు. సుమిత్రతో "ఏమిటి విశేషాలు?'' అన్నాను నేను. సుమిత్ర కిటికీలోనుంచి బయట గార్డెన్ వేపు చూస్తూ "విజయా? నా పరిస్థితులేమీ బావులేవు. నిరాశ నిండి పోయివుంది నా జీవితంలో''అంది బాధగా. కళ్ళలోనీళ్ళు మెరుస్తూ బుగ్గలమీదనుంచి జారాయి. నేను సుమిత్రని నా వేపు తిప్పుకుంటూ" "ఏమిటిసంగతి? నాతో చెప్పవూ!" అన్నాను.

"మేము నైజాం వెళ్ళాక నాన్నగారు నాకు పెళ్ళి ప్రయత్నాలారంభించారు. దానితో నేను స్కూల్ ఫైనల్ తోనే ఆగిపోయాను. నాన్నగారికి పెత్తండ్రి కూతురొకావిడ వుండేది. ఆవిడకి మంచి ఆస్తివున్నా ఆవిడ భర్త బిజినెస్ లో అదంతా పాడుచేశాడు. ఒక సమయంలో అత్యవసరంగాపదివేలు బిజినెస్ కి కావలిసొచ్చిందట. లేకపోతే నష్టమొస్తుంది, మాకుబాగా పొలాలవీ వున్నసంగతి నీకుతెలుసుగా. ఆవిడ మానాన్నదగ్గిరకొచ్చి "అన్నయ్యా ఈసమయంలో కాపాడకపోతే వీల్లే''దని మొదలు పెట్టిందట. నాన్నగారు ఏమీఅనటానికివీల్లేక యిచ్చారుట. ఇది నా చిన్నతనంలో జరిగినసంగతి. కాని ఆ పదివేలూ కూడా వాళ్ళని రక్షించలేక పోయాయి. సంసారం చితికి పోయింది. ఆయనా పోయాడు. ఒక్కకొడుకూ, ఆవిడా. రెండెకరాల భూమి యివి నిలిచాయి. ఆవిడ ఒక్క కొడుకుని ఎల్లాగోలా చదివించు కొచ్చింది. నాకు పెళ్ళి ప్రయత్నాలు చేస్తుంటే అతను కలకత్తాలో గ్రౌండ్ యింజనీరుగా వర్క్ చేస్తున్నాడు. నాన్నగారి కతను నచ్చాడు. అందమూ, చదువూ ఉద్యోగమూ అన్నీ వున్నాయి. ఆస్తిలేక పోయ్నిందని బాధలేదు. వెంటనే ఆవిడకిరాశారు. వాళ్ళిద్దరూ వొచ్చి చూశారు నన్ను. అతనేదో ననగటం

విన్నాను. నాన్నగారు మేడమీద "చేసుకుంటే చేసుకోండి లేకపోతే నా పదివేలూ తెచ్చివ్వండి యిప్పుడు" అని కఠోరంగా చెప్పటం విన్నాను. ఆవిడ అతన్ని బతిమాలింది "నుంచున్న పాళాన పదివేలూ ఎక్కడ తెచ్చివ్వగలం? పిల్ల నచ్చిందన్నాక యింకేమిటిరా?" అని కన్నీళ్ళు పెట్టుకుంటోంటే నేను మేడమీద నుంచి చూశాను. తల్లిమాట తీశెయ్యలేక కాబోలు వొప్పుకున్నాడు.

పెళ్ళి సక్రమంగా జరిగింది. మా అత్తగారితో నన్ను తీసుకురమ్మని చెప్పి వారు ముందు వెళ్ళి పోయారు. అత్తగారు నన్ను కలకత్తా తీసుకు వెళ్ళారు. ఆవిడ ఉన్నప్పుడు యీయన సరిగానేమాట్లాడేవారు. ఆవిడంటే కొంచెం భయముంది. ఓ నెల్లాళ్ళుండి ఆవిడ స్వగ్రామం వెళ్ళిపోయారు. ఆవిడవెళ్ళాక యీయన నాతో సరిగా మాట్లాడటం మానేశారు. "బంగళా అవరణదాటవ్. వొట్టి పిరికిమనిషివి తయారయావు" అని పెద్దకేకలువేసి నన్ను వెంటబెట్టుకుని లేడీస్‌క్లబ్‌కి తీసుకెళ్ళి మెంబరుగాజాయిన్ చేశారు. క్లబ్ శక్రటరీ ఎమ్. ఏ. పాసైందిట. ఆవిడ వీరికి షేక్‌హాండ్యిచ్చి చాలాసరదాగా మాట్లాడింది. ప్రెసిడెంట్ కార్పొరేషన్ మేయరుగారి భార్య. ఆవిడ ఎడ్వొకేట్ కూడాను. వాళ్ళంతా యింగ్లీషులో నాతో మాట్లాడుతుంటే జవాబు చెప్పాలంటే వణుకొచ్చేది. తప్పు తప్పులుగా యింగ్లీషు దొర్లేది. నా తోటిమెంబర్సు రుమాళ్ళు మొహానికి అడ్డు చేసుకొనేవారు. చచ్చేటంత సిగ్గుతో మొహం కందిపోయేది ఇంటికొచ్చాక ఆసంగతి వీరితో చెబుతో "అవును ఎల్లాగయితేనేం స్కూల్‌ఫైనల్ గ్రాడ్యుయేట్‌వి తయారయావు. డబ్బు మాటొచ్చింది గ్నానీ లేకపోతే ఏ గ్రాడ్యుయేట్ నన్నా చేసికొని వుందును." అని విసుక్కొనేవారు. ఎల్లాగో చికాకులతో రెండు నెలలు గడిచాయి. "నిన్ను మీవాళ్ళ దగ్గిరకి తీసుకు వెడతాను పండుగకి పదమన్నారు" సరేనన్నాను. అంతే తను యిక్కడ రెండురోజులున్నారు వెళ్ళిపోయారు. మళ్ళీతీసికెడతాననే మాటేలేదు. ఈమధ్య ఉత్తరాలకీ జవాబులే వుండటంలేదు. మా అన్నయ్యకి అభిమానం మెక్కువా అత్తగారి మాటని కూడా తోసేసి వుంటారు" ఆమె కళ్ళలోంచి నీళ్ళు ధారా ప్రవాహంగా కారుతు న్నాయి. నా వొళ్ళోకి వాలిపోయింది.

"చూడు సుమిత్రా! ఇవాల్టినుంచి నీబాధ్యత నాది. రేపు సరిగ్గా నాలుగున్నరకి మాయింటికిరా. అప్పుడు ఆలోచిద్దాం" అనివోదార్చాను. ఇంటికి చేరేవరకూ నాకుఒకటే ఆలోచన. "సుమిత్రని మెరుగుపెట్టాలి" అనే నా మనసంతా నిండిపోయింది. యీ సంగతివొక్కటే.

మర్నాడు సంగతంతా వారికి చెప్పాను.

"సరే! యింకా సందేహిస్తావేం. సుమిత్రని కోచ్‌అప్ చెయ్యి" అన్నారు వరండా మెట్లు దిగుతూ. సాయంత్రం సరిగా నేను చెప్పిన టైముకే సుమిత్ర వొచ్చింది. మెల్లిగా ఆమెతో "చూడు సుమిత్రా! నీబాధ్యతంతా నామీదవెయ్. పట్టుదల తెచ్చుకో. మీవారు నిన్ను తనతో కలకత్తా తీసుకు వెళ్ళేట్టు చేస్తాను" అన్నాను. ఆమె కళ్ళలో ఏదోజ్యోతి వెలిగింది. అ ప్రయత్నంగా యిద్దరం కాలెండర్ చూశాం. ఏప్రిల్ మూడో తారీకురెప రెప లాడింది. నాసలహామీద వారంరోజుల్లో యింటర్ మీడియేట్ బుక్స్ అన్నికొనుక్కుంది. కష్టపడి చదవటం మొదలు పెట్టింది. నేను కాలేజీనుంచి వస్తుంటే దార్లో నన్ను పుస్తకాలతోవొచ్చి కలుసు కునేది. గిర్రున తిరిగి వొచ్చింది మార్చి మాకాలేజీలోనేఎపియరయింది. ఎగ్జామినేషన్స్ ఆఖరిరోజున వొస్తుంటేచూశాను. సుమిత్ర ఆవాళ నేను చూసినకంటే యీ పదకొండు నెలల్లోనూ చిక్కిపోయిందిన్ని అన్నిపేపర్లూ ధైర్యంగానేరాశాను విజయా! ఏమవుతుందోమరి"అంది.

రిజల్ట్స్ వొచ్చేశాయి. క్లాస్‌లో పాసయింది సుమిత్ర. కాలేజీలు తెరవగానే నేను వర్క్ చేస్తున్న కాలేజీలోనే ఎకనామిక్స్ ఆనర్స్‌లో జాయినయింది కాలేజీ... పరీక్షలూ తప్ప మరోదృష్టిలేదు సుమిత్రకి. ఎట్లాగడిచాయో మూడేళ్ళూను. ఆశ్చర్యం వేస్తుంది తలుచుకుంటే ఫైనలియర్ ఎగ్జామినేషన్స్ అయిపోయాయి. సుమిత్ర చాలా మారిపోయింది. లేడీస్‌క్లబ్‌లో శక్రటరీగా వుంటోంది మెంబర్సతో చకచకా మాట్లాడుతుంది. మెంబర్సంతా అడగటమే "మీనెంబరెంత?" అని నవ్వి వూరుకునేది. రిజల్ట్స్ వొచ్చాయి. క్లాస్‌రాక ఏమవుతుంది!

మర్నాడు వాళ్ళవారికి ఘాటుగా యింగ్లీషులోరాసింది వుత్తరం కలకత్తాలో ఏ కాలేజీలోనేనా లెక్చరర్ పోస్టు ఖాళీగావుందేమోనని. పదిరోజుల్లో రిప్లయి వచ్చింది. ఫలానకాలేజీకి ఎకనామిక్స్‌లెక్చరర్ కావాలనీ, స్వయంగా తీసుకెళ్ళటానికి వొస్తున్నాననీను.....సుమిత్ర బ్రెయిన్‌లో ఎక్కాక "గురుదక్షిణ ఏమిస్తావు?" అన్నాను.

సుమిత్ర చేతులు జోడించింది.

# నిధులూ - విధులూ

అడివి కనకరాజు

అదొక చిన్న దీవి.

సాయం సమయమైంది. ఎఱ్ఱటి సూర్యుడు మేఘాల్లోకి చొచ్చుకు పోతున్నాడు. ఉండుండి, గగనపథాన విహంగ తతులు కలకల స్వరాల్తో గూళ్ళకి ఎగురుతూ పోతున్నాయి. నురగలుకక్కుతుంటూ సముద్రం భీషణ ఘోషణంతో ముందుకురుకుతూన్నది. మిగిలిన వాతావరణం ప్రశాంతం. అక్కడక్కడ గుట్టలు, వాటిమీద చిమ్మినట్లుగా పడి ఉన్న నత్తగుల్లలూ గుళకరాళ్ళూ, అక్కడక్కడ, ఉత్సాహంతో సాగర సందేశాన్నాలకిస్తున్నట్లుగా మెల్లిగా తలలూపే చెట్లు - సముద్రంలో ఒకపడవ అందులో ప్రకృతి రామణీయకతను తిలకిస్తూ 30.35సం॥ వయస్సుగల ఇద్దరుయువకులు వారిలో ఒకడుత్సాహంగా తెడ్లు వేస్తున్నాడు.

"మిష్టర్ జాక్ ! ఏది ! ఆమేప్ ఇలా తే ఎన్ని మైళ్ళొచ్చామంటావ్ మనం ?" అందులో ఒక డడిగాడు. రెండవవాడు సమాధాన మిచ్చాడు.

"చాలా దూరం వచ్చేశాం చూడు డేవిడ్ ! ఇంక ఎంతో దూరం ఉండదను కుంటాను" అతడా పటాన్ని డేవిడ్ కందించాడు. పలుమార్లు మడచబడి, శిధిలావస్థలో ఉన్న ఆపటాన్ని డేవిడ్ మోకాళ్ళమీద పెట్టుకుని ఆతురతగా తెరచాడు జాక్ తెడ్లందుకున్నాడు.

డేవిడ్ హుషారుగా చిటిక వేసి అన్నాడు.

"మిష్టర్ జాక్ ! మనం రేపు సాయంత్రానికి నిధిని వశం చేసుకుని ఇంటిముఖం పట్టేస్తాం. నిజంగా నా మనస్సూ, నా శరీరంకూడా ఆతురతతో వశం తప్పిపోతున్నాయి. ఇకమనం చాలాహుషాయిగా పోతాంలే ! దీని తరువాత దీవిఒకటుంది చూడు ! అదే మనగమ్యస్థానం. ఒక రెండుమైళ్ళు పోయి, అక్కడ బస చేద్దాం. వెన్నెల బాగా ఉంటే తరువాత సంగతి చూద్దాం !"

"నిజంగా మనం అదృష్టవంతులం మిష్టర్ డేవిడ్ ! మన భావి జీవితాల్లో ఇక ధనానికి బాధపడనవుసరంలేదు ఉచ్ఛస్థితిలో జీవించవచ్చు. ఆ సముద్రపు దొంగల గుంపు ఓడల్ని తెగదోచుకునేదట ! ఆనాయకుడు - వాడుమాత్రం ఆ నిధినంతా అక్కడ రహస్యంగా దాచకపోతే ఏంచేసుకుంటాడంటా? అదంతా చూసి సంతోషించాల్సిందే కాని, ఏం అనుభవిస్తాడు? అది మనరాత .మేప్ మన చేతుల్లో పడింది !"

డేవిడ్ ప్రక్కనున్న సంచినంతనూ సవరించి సిగరెట్ ప్యాకెట్ ఒకటి తీశాడు. తననోట్లో వకటి పెట్టుకొని, చేత్తో మరొకటితీసి, తిరిగి యథాస్థానంలో ఉంచేశాడు. చలాకీగా మోకాలుమీదిపటాన్ని మడిచి ప్రక్కనే ఉన్న పెట్టెలో భద్రంగా ఉంచాడు. "మిష్టర్ ! ఇదుగో ! నువ్వొకటితీసుకో. ఏదీఅగ్గిపెట్టె !" అని చెయ్యిజాపాడు. జాక్ చెయ్యి ఒకటి జేబుతడిమి అగ్గిపెట్టె అందించింది. సిగరెట్ ముట్టించి అతడు ఆలోచనలో మునిగిపోయాడు.

ఇద్దరి మనస్సులూ కట్టలుతెగి ప్రవహిస్తున్నాయి. శరవేగంతో గమ్యస్థానాన్ని చేరుకుంటున్నాయి. అక్కడ కొంతవరకూ అనూహ్యమైన వాతావరణం. సముద్రపు టొడ్డునుండి సుమారు ఒక అరమైలు దూరం దీవిలోకి చొచ్చుకొని పోతే - చుట్టుపట్ల చిన్నచిన్న గుట్టలూ-వాటి నడుమ అన్నిటి కంటె ఉన్నతమైన ఒక గుట్ట - దాని మొదట్లోనే దక్షిణదిశలో నిక్షిప్తమైంది ధనం - ఇది ఆ పటంలోని సారాంశం.

ఆ ధనా న్నక్కడ భద్రపరచింది ఒక సముద్రపు దొంగలనాయకుడట చాలా సంవత్సరాలనుంచీ అది అక్కడే ఉండి పోయింది ఆదీవి. ఇతరులకు చేరరాని ప్రదేశమై పోయింది. సర్వాతీతమైన పేరాశ వారిరువుర్నీ ప్రాణాలకు తెగించి, అంతటి తీక్షణమైన ప్రయాణాని కొడంబరచింది.

క్రమక్రమంగా చీకటులు నల్దిశలా వ్యాపిస్తున్నాయి. ఒక గుట్ట వద్దకు తమ సరుకుల్ని జేరవేశారు మిత్రులిద్దరూ. తరువాత వారిద్దరూ నాటి రాత్రి భోజనానికి ప్రయత్నాల్లో మునిగిపోయారు. లంగరు వేయబడ్డ పడవ సముద్రపు కెరటాలకిటూ ఆటూ ఊగిసలాడ్తోంది.

సాయంత్రం పదేవేళకి పడవ ఆ దీవి చేరుకుంది. అక్కడ మానవ సంచారంలేదు. గుట్టలూ-అక్కడక్కడ పొదలూ చెట్లూ వాటిపైని పక్షులూ మాత్రం గోచరిస్తాయి మిత్రులిరువురూ ఆత్రంగా పడవదిగారు. లంగరువేసి,

చెరోపార, చెరో తుపాకీ చేతబట్టుకుని వడివడిగానడుస్తూ వెళ్ళిపోయారు.

"అదుగో ! ఆ కొండ మొదట్లోనే అయి ఉంటుంది. అక్కడేదో త్రవ్విన గొయ్యి కనబడుతోందే !" అన్నాడు జాక్. సూర్యకిరణాలు దృష్టి భంగం చెయ్యకుండా, చెయ్యి అడ్డుపెట్టుకుని గుట్టపైనుంచిముందుకు పరిశీలనగా చూస్తూ.

ఔను. ఆ ప్రక్కనే చూడు ! ఏదో మానవాకారం లాగుంది ! అరె ! మనకంటె ముందే ఎవరో వచ్చినట్లున్నారే ! తుపాకి సిద్ధం ! అన్నాడు డేవిడ్ ముందుకురుకుతూ. ఇరువురూ తుపాకులు సరిచేసుకుని ముందుకు పరుగిడి పోయారు.

"నిజమే ! మనకంటె ముందుగానే ఎవరో వచ్చి, నిధిని త్రవ్వేశారు. కాని ..." ఆ గొయ్యి ప్రక్కనే ఉన్న అస్థిపంజరంపై దృష్టి నిలువగానే డేవిడ్ నోరు కట్టుపడి పోయింది.

తవ్వబడిన పెద్దగొయ్యి. అందులో ఎంతో కాలం నుండి మట్టితో కప్పబడిపోయి, మానవునిలో ఆశనురేకెత్తిస్తూ ఆహ్వానించే అక్కడక్కడ కనబడ్తూన్న బంగారు కణికెలూ సమీపంలోనే ఒక త్రుప్పు పట్టిన పార, శిధిలావస్థలో ఉన్న తుపాకి, ఇరవై గజాల దూరంలో ఒక మానవుని అస్థి పంజరం - భయం కొల్పేటట్లుంది. పరిసరాలు నిర్మానుష్యం.

"ఎవరో చైనాదేశీయుడు లాగున్నాడు దురదృష్టవంతుడు. ఎందుకు చచ్చిపోయాడంటావ్?"

"ఎవరన్నా అతణ్ణి కాల్చేసి ఉంటారేమో ?"

"మరి ఆగొయ్యి అల్లాగే ఉండిపోయిందే !"

జాక్ అంగరఖా తీసి నేలమీద పరిచాడు. "దీన్ని బట్టి చాలా కాలంగా ఈ ప్రదేశంలో ఎవ్వడూ అడుగు మోపలేదన్నమాట !" డేవిడ్ తన అంగరఖాకూడా తీసి నేలమీద పరిచాడు. హుంషారుగా నాల్గుసార్లు పారతో కణికెలు తీసి వాటిమీద పోశాడు. బంగారం పడవకు జేరవెయ్యటంకూడా నిశ్శబ్దంగా జరిగి పోతోంది.

డేవిడ్ పారవేసి. చొక్కాలో క్రుమ్మరించి. చేతితో సరిచేశాడు. "అబ్బ ! ఏదో ముళ్ళలాగ గుచ్చుకుంటున్నాయి ! ఇంత బాధగాఉందేం !" అనుకున్నాడు. ఆ ఆతురతలో అతడి కది భరింపశక్యమైంది.

"అబ్బ! ముళ్ళు తెగ గుచ్చుకున్నాయ !" అతడరి చేతులు విప్పిచూసుకున్నాడు. పడవ దగ్గరకువెళ్ళిన జాక్ ఇంతలో తిరిగివచ్చాడు.

"జాక్ ! నన్నేదో బలహీనత ఆవరించింది. శరీరం వణకుతోంది. ఏవో ముళ్ళు గుచ్చుకుంటున్నాయి నా చేతులుచూడు కొద్ది నిమిషాల్లోనే ఎల్లా పాలిపోయాయో ! నేను కాస్సేపు విశ్రాంతి తీసుకుంటాను. కొంచెం సేపు నువ్వుచూడు ! అన్నాడు డేవిడ్ మెల్లిగా దారి ప్రక్కకు ప్రాకుతూ.

జాక్ పారతీసుకుని రెండు మూడు సార్లు త్రవ్వాడు. "నిజమే నాకూ గుచ్చుకుంటున్నాయి. ఏమిటో ఆ ముళ్ళు నాకూ నీరసం పట్టేటట్టుందే !" అనుకున్నాడు. జాక్ తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో పారవేసి, సమీపానఉన్న పడవదగ్గరకు తీసుకు పోయాడు. తిరిగి వచ్చేటప్పటికి శరీరం నిశ్చలత్వం ఉడిగి తూలి పోతున్నాడు. కళ్ళు చీకట్లు క్రమ్ముతున్నాయి. పారప్రక్కనే కూలబడి. డేవిడ్ వైపుకు చేతులు చాపుతూ అన్నాడు. "డేవిడ్ ! ఏమిటిది నాకు కూడా శక్తులుడిగి పోతున్నాయి" అప్పటికే డేవిడ్ అవసాన దశలో ఉన్నాడు. మెల్లిగామూల్గి భారంగా కళ్ళు విప్పి చూశాడు. ముఖంఅంతా తెల్లబడి పోయింది. కనురెప్పలు బరువుగా మూతపడ్తున్నాయి.

"జాక్ ! నేను చచ్చిపోతున్నాను. నన్ను తాకకు నా శరీరంలో విషం ప్రవేశించింది. ఈ నిధి పాతిపెట్టినప్పుడే వాళ్ళు ఈ ధనంతోబాటు ప్రమాదకరమైన, విషప్రచ్ఛన్నమైన కంటకాలను కూడా వాటిమీద కప్పారు. ఇతరులెవరూ దొంగిలించకుండా ఉండేందుకు వాళ్ళలా వేసి ఉంటారు. వాటిని మనం సామాన్యమైన ముళ్ళుగా ఎంచి అజాగ్రత్త వహించాం. దాని ఫలితంఇది !" డేవిడ్ కళ్ళు మూతలు పడ్డాయి.

రెండు నిముషాలు గడిచాయి. జాక్‌కు కళ్ళు భారంగా మూతలు పడ్తున్నాయి. అతగాడుకూడా ఆ నిక్షేపంవైపు ఆఖరుసారిగా దృక్కు నిగిడించి" దురదృష్టవంతులం !" అన్నాడు.

(ఒక ఆంగ్లకథ ఆధారం)



# ANDHRA MAHILA SABHA



Workers are the first great asset of any public institution. No good cause ever suffers for want of funds, if it is rich in earnest and efficient workers. The avowed object of our association is to bring out such workers in good numbers and harness their services in the building up of the future of our Nation and Womanhood. We have accordingly chalked out to ourselves a programme of work, instruction and service which is calculated to ripen and bear fruit in courage, selflessness and high-hearted public spirit.

ANDHRA MAHILA SABHA



## TRUST BOARD

RANI OF MIRZAPUR
*President*

Smt. DURGABAI DESHMUKH
*Founder-Secretary*

RANI OF BOBBILI

RANI RAJYALAKSHMI

Smt. A. LAKSHALAMMA

" K. MANIKYAMBA

" A. C. KRISHNA RAO

" B. KRISHNAVENAMMA

Kumari J. JAMUNABAI

## MANAGING COMMITTEE

Smt. B. TIMMABAI

" K. LAKSHMI RAGHURAM
*Jt. Secretaries*

Smt. V. LAKSHMI PARVATI

" P. SAMPURNAMMA

" G. LAKSHMIKANTHAMMA

" A. PARVATA VARDHANI

" KAMALA KESAVA RAO

Kumari R. KAMALABAI



## NURSING HOME COMMITTEE

Smt. V. Lakshmi parvathi
*Secretary*

Mrs. A. C. Krishna Rao
*Administrative Secretary*

Dr. M. Pavana Bai,

Smt. Durgabai Deshmukh
*Founder-Secretary*

Miss. Adranvala

Rani Rajyalakshmi Prasad

Smt. P. Annapurnamma

Dr. Avadhani

Dr. Doraiswami

Sri B. V. D. Narayana Rao

## ANDHRA MAHILA ADVISORY COMMITTEE

Smt. Lakshmi Raghuram
***Editor***

Smt. K. Ranganayakamma

Kumari R. Kamalabai

Sri. B. V. D. Narayana Rao

## WOMEN'S SAVINGS CAMPAIGN

Smt. P. Sakuntalamma

Smt. B. Timmabai

Smt. G. Venkubayamma

## MAHILA VIDYALAYA

### Andhra Mahila Sabha

With the idea of spreading education among women, especialy among adults, we have organised various classes for their benefit.

**ADMISSION EXAMINATION ( Banares Hindu University )**

This Examination is equivalent to S.S.L.C. and enables women to qualify themselves for admission to a college or a vocational institution in any University. The Admission examination is held at Banares in March—April.

This section is divided into the Senior, Junior and Sub-Junior classes. If a student is well up in English and other subjects at the time of admission, the course is only one year for her. She will be admitted into the senior class otherwise the course is two years and she will be admitted only into the junior class. Sub-junior is a preparatory class. Admission is open to girls above twelve years only.

The subjects for which coaching is provided are :—

English
Modern Indian Language (Telugu, Hindi or Tamil.)
History
Civics
Domestic Science.

Students may take mathematics instead of Domestic science or civics but in that case they have to arrange for tuition in that subject.

**MATRICULATION EXAMINATION ( Andhra )**

The candidate should complete the age of fifteen years on or before the first day of the Examination.



SRI CHINNAMAMBA VIDYA MANDIR, GIFT OF THE MAHARAJAH OF PITHAPURAM

The course is spread over two years, Junior matric and Senior matric. Candidates who do not possess the required standard even for the Junior matric will be admitted into E.S.L.C. class with English as a compulsory subject.

Candidates can answer the Examination papers in Telugu.

The subjects for wich coaching is provided are :—

**Part I.** (i) English
(ii) Second Language (Telugu.)
(iii) Elementary Mathematics.

**Part II.** (i) Physics and Chemistry
or
(ii) Indian History and British History.

N.B :— (i) The candidate should appear for the examination at one of the Centres in the Andhra State
(ii) The candidate has to remit an exemption fee in August as prescribed by the University.

**E.S.L.C. (Madras)**

This examination is equivalent to Form III of the Secondary Schools. Coaching is spread over two years and this period may be shortened or lengthened according to the previous education of the candidate. Since third form qualification is considered to be essential for further studies or for employment in various services, this course will be of special benefit to women desiring to qualify themselves as craft or vocational teachers. The training in crafts provided in our Industrial Institute runs concurrently with the training for this examination.

Instruction is imparted through the medium of the regional languages Telugu and Tamil. Candidates intending to appear for this examination should have completed 15 years.

The subjects taught are :—

1. Mother tongue, i.e. Telugu or Tamil.
2. Elementary Mathematics.
3. General Science.
4. Social Studies.
5. English (Optional)

N. B:— Those desiring to study further for Matriculation (Andhra University) or Admission Examination (Banares University) should take English as a compulsory subject.

## HINDI AND FINE ARTS

Classes are conducted for Prathamik, Madhyama, Rashtrabhasha, Pravesik and Visarad Examinations of the Dakshin Bharat Hindi Prachar Sabha. Provision is made to teach Hindi in all classes of all departments. Instruction is given in Painting, Music and Bharata Natyam.

## MALLAMADEVI HOSTEL

Hostel facilities are provided principally for the benefit of the students, staff and workers of the various sections of the Sabha. The Jt. Secretary in charge of the hostel may, however, admit women working in other institutions or offices in the city provided there is accommodation and they agree to abide by the rules and regulations of the Sabha and hostel. All those residing in the hostel including guests should, in the interests of discipline, abide by the rules framed for the conduct of the hostel.



SRI MALLAMA DEVI HOSTEL, GIFT OF THE RANI OF BOBBILI

## INDUSTRIAL SECTION

### RAJYALAKSHMI INDUSTRIAL INSTITUTE

Women are trained in crafts under (a) according to the syllabus prescribed for the Lower and Higher grade Government Technical Examinations. Crafts classed under (b) are taught according to an independent syllabus. Classes marked (c) are organised by the Govt. of India, Ministry of Labour.

(a) 1. Needle work and Dress-making.
2. Embroidery.
3. Handloom Weaving.

Candidates who have elementary knowledge in sewing will be sent for the lower grade examination in less than a year, and for the higher grade examination after a year after passing the lower grade. There is provision to teach more than one craft at a time according to the aptitude of the trainees. At the end of $1\frac{1}{2}$ to 2 years, it is possible for a trainee to take the Higher Grade Diploma in one craft with a Lower Grade Diploma in another craft, in addition to getting certain amount of skill in one or more crafts classed under class (b).

(b) 4. Composing, Book-Binding, Printing, and Proof reading.
5. Ginning, Carding, Silver-making and Spinning.
6. Lace work and knitting.
7. Gold and Mirror Embroidery.

Part time classes in Needlework and Dress-making are held in the afternoons in the following places under the auspices of the above institution.

(i) Andhra Mahila Sabha, 24-A, Luz Church Road, Mylapore, Madras 4.
(ii) 7-A, Rosary Church Road, Mylapore, Madras 4.
(iii) Andhra Mahila Sabha Nursing Home, Madras 28.

There is provision to coach up these part time students for the technical examination in Needle-work and Dress-making.

(c) 8. Dyeing and Printing of textiles.
9. Weaving.
10. Knitting with hand machines.
11. Cutting and Tailoring.
12. Embroidery.
13. Book-binding.

Training in these trades is of one year's duration. The session starts in July and ends in June. At the close of session, a trade test will be conducted and the successful trainess will be issued a certificate to that effect.



THE INDUSTRIAL INSTITUTE, 7-A, ROSARY CHURCH ROAD MADRAS 4.

Tuition is free and there is provision for study stipends to ex-service women, and other deserving candidates, of value of Rs. 25/- per month. These classes are conducted at 7-A, Rosary Chuch Road, Madras 4. and the students are given lodging and boarding in the I. T. C. Hostel run at Sthree Seva Mandir, 5, Santhome High Road, Madras 4. Particulars of the I. T. C. Hostel may be obtained from Secretary, Sthree Seva Mandir. Passed or failed S. S. L. Cs. above the age of 17 are eligible for admission into these trades.

N. B:— Job orders will be executed and collected by our skilled workers from homes if necessary. Our staff will give tuitions in needle-work and embroidery in the homes of members desirous of having such facilities.

## LAKSHALAMMA TECHNICAL INSTITUTE

Coaching is offered in short-Hand and type writing as per the syllabus prescribed for the Govt. Technical Examinations held in April and October.

## ANDHRA MAHILA

A Telugu Monthly Magazine, published by the Sabha and devoted to serve the Cause of women, by propagating knowledge among them and by encouraging them to exhibit their latent powers of expression. It is printed in the Andhra Mahila Press.

## ANDHRA MAHILA PRESS

Situated at the Andhra Mahila Sabha Industrial Institute Buildings, 7-A, Rosary Church Road, Mylapore, Madras-4, it undertakes job printing and book printing, in Telugu, Tamil and English, in addition to book-binding.

## NIRMALA DEVI GRANDHALAYAM

A library and free reading room, containing over three thousand books. Several periodicals and leading dailies in Telugu, Tamil, English and Hindi are available to the readers.

## HOURS OF WORK

| | | | |
|---|---|---|---|
| Office | ... | 10 a.m. | to 5 p m. |
| Press | ... | 8-30 a. m. | to 5-30 p.m. |
| Classes | ... | 10 a.m. | to 4-15 p.m. |
| ,, Hindi & Arts | ... | 4-30 p m. | to 7-30 p.m. |
| | | (according | to time-table) |

*All communications to:* Joint Secretaries ANDHRA MAHILA SABHA Madras 4.
Each enquiry must be accompanied by a stamped and self-addressed envelope or post-card.
Interviews: 2 to 5 p.m. MONDAY, WEDNESDAY and FRIDAY.
All classes re-open in June after Summer vacation.

## MEMBERSHIP

Membership of the Sabha is open to all women, irrespective of caste, creed or nationality. Women desirous of taking advantage of the classes organised by the A. M. S. should enrol themselves as members of the Sabha.

## MEMBERSHIP FEES

| | | | |
|---|---|---|---|
| Royal Patron | ... | Rs. | 1,000/- |
| Patron | ... | ,, | 500/- |
| Life Membership | ... | ,, | 100/- |
| Annual ,, | ... | ,, | 10/- |
| Monthly ,, | ... | ,, | 1/- (to students only) |
| Admission fee | ... | ,, | 2/- |

## TUITION FEES

*There are three terms per year*

### BANARES ADMISSION & ANDHRA MATRIC

| Special fees | | | Class fees (for senior class) |
|---|---|---|---|
| On admission | Rs. | 31/- | Rs. 12/- per month payable for 10 months from June to March both months inclusive. |
| In October | ,, | 8/- | |
| In January | ,, | 8/- | |

### JUNIOR ADMISSION & JUNIOR MATRIC

| | | | |
|---|---|---|---|
| On admission | Rs. | 31/- | Rs. 10. per month payable for 12 months from June to May. |
| In October | ,, | 8/- | |
| In January | ,, | 8/- | |

### SUB - JUNIOR

| | | | |
|---|---|---|---|
| On admission | Rs. | 31/- | Rs. 7/- per month payable for 12 months from June to May. |
| In October | ,, | 8/- | |
| In January | ,, | 8/- | |

### E. S. L. C. SENIOR

| | | | |
|---|---|---|---|
| On admission | Rs. | 10-0-0 | Per month Rs. 2-0-0 per 10 months from June to March. |

### E. S. L. C JUNIOR

| | | | |
|---|---|---|---|
| On admission | Rs. | 8-0-0 | Per month Re. 1-0-0 per 12 months from June to May. |

### INDUSTRIAL INSTITUTE

**Part Time Students:**

| | | | |
|---|---|---|---|
| On admission | Rs. | 5/- | For any one craft including membership. |
| Every month | ,, | 3/- | |

**Regular Students:**

| | | | |
|---|---|---|---|
| On admission | ,, | 3/- | For any one craft including membership. |
| Every month | ,, | 1/- | |

### SHORT-HAND & TYPE-WRITING

| | | | |
|---|---|---|---|
| On admission | Rs | 8/- | |
| Every month | ,, | 5/- | Including membership. |

### HINDI

| | | | |
|---|---|---|---|
| On admission | Rs. | 5/- | Rashtrabhasha Rs. 4/- |
| Prathamik | ,, | 1/- | Visarad ,, 7/- all fees |
| Madhyama | , | 2/- | per month including membership. |

## MALLAMADEVI HOSTEL

| | | |
|---|---|---|
| Caution Money repayable | ... | Rs. 60/- |
| Medical fees | ... | ,, 3/- per year. |
| Establishment | ... | ,, 7-8-0 per month. |
| Mess Charges (2 meals) | ... | ,, 28/- |

Coffee and Tiffin. if required, will be Charged extra.

Residents who are not students of the Sabha will have to pay special fees of Rs. 20/- on admission, and mess charges including establishment charges Rs. 40/- per month. Casual residents will be charged Rs. 2/8- per day.

All charges must be paid in advance by the 5th of every month.

## INTERMEDIATE (Arts & Science) OF THE BANARES HINDU UNIVERSITY

Classes for the Intermediate Examination of the Banares Hindu University will commence from the 15th of June 1956 in Andhra Mahila Sabha.

Women who have passed the Admission Examination (B. H. U.) or Matriculation of the Andhra University or any other equivalent examination are eligible to appear for the Intermediate Examination of the B. H. U. as private candidates provided not less than two academic years have elapsed since the candidate passed the Admission or an equivalent examination.

The subjects for Examination and for which coaching is provided in Andhra Mahila Sabha are as follows.

### INTERMEDIATE IN ARTS

I *Compulsory Subjects*;

(a) English
(b) Composition in a Modern Indian Language (Telugu, Tamil or Hindi)

II *Optional Subjects*:

(1) History
(2) Elementary Economics
(3) Civics

It is essential that a candidate should pass a preliminary examination in Sanskrit before she can appear for the Intermediate Examination of the Banares Hindu University. The examination consists of one paper only and the course prescribed for this examination shall cover some typical declensions and conjugations and simple Samasas and easy selections. This examination is held in Banares just before the Intermediate Examination.

Classes for Intermediate in Science will also be conducted provided sufficient candidates apply for admission. The optional subjects will be. Mathematics, Physics and Chemistry or Biology, Physics and chemistry.

Those seeking admission into Intermediate (Arts or Science) classes should apply to the Secretary, Andhra Mahila Sabha immediately.

The course is for two years-Junior and Senior

## FEES SCHEDULE

Intermediate Junior class (course consists of three terms-July-September, October-December and Januray-March.)

| | First Term | | | Second Term | | | Third Term | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | Rs. | As. | Ps. | Rs. | | | Rs. | | |
| **Admission** | 2 | 0 | 0 | | | | | | |
| **Sabha Membership** | 10 | 0 | 0 | | | | | | |
| **Journal** | 6 | 0 | 0 | | | | | | |
| **Tuition** | 80 | 0 | 0 | 80 | 0 | 0 | 80 | 0 | 0 |
| **Library** | 10 | 0 | 0 | 5 | 0 | 0 | 5 | 0 | 0 |
| | 108 | 0 | 0 | 85 | 0 | 0 | 85 | 0 | 0 |

NB :— Tuition fees for Intermediate (Science) are Rs. 100 per Term. Other fees same as for Inter (Arts)

# ANDHRA MAHILA SABHA

## BANARAS HINDU UNIVERSITY

### ADMISSION EXAMINATION RESULTS

| Year | Number of candidates appeared | Number passed |
|---|---|---|
| 1947 | 21 | 19 |
| 1948 | 19 | 13 |
| 1949 | 17 | 16 |
| 1950 | 31 | 26 |
| 1951 | 31 | 26 |
| 1952 | 39 | 19 |
| 1953 | 40 | 26 |
| 1954 | 30 | 26 |
| 1955 | 43 | 33 |

(We are unable to furnish the results for years previous to 1947 as they are not readily available.)

# ANDHRA MAHILA SABHA

## RANI RAJYALAKSHMI INDUSTRIAL INSTITUTE

### RESULTS

| Year | Cutting & Tailoring | | | | Embroidery. | | | | Total |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | Higher | | Lower | | Higher | | Lower | | |
| | Number appeared | Number passed | Number appeared | Number passed | Number appeared | Number passed | Number appeared | Number passed | |
| 1947 | — | — | 6 | 6 | — | — | 8 | 5 | 11 |
| 1948 | — | — | 6 | 5 | — | — | 4 | 3 | 8 |
| 1949 | 6 | 6 | 8 | 6 | 3 | 3 | 7 | 4 | 19 |
| 1950 | 6 | 5 | 15 | 9 | — | — | 5 | 5 | 19 |
| 1951 | 6 | 4 | 11 | 10 | 4 | 1 | 3 | 3 | 18 |
| 1952 | 10 | 8 | 11 | 7 | — | — | 8 | 7 | 22 |
| 1953 | 12 | 8 | 13 | 8 | — | — | 12 | — | 16 |
| 1954 | 9 | 9 | 26 | 23 | — | — | 5 | 4 | 36 |
| 1955 | 10 | 7 | 14 | 8 | 5 | 4 | 11 | 8 | 27 |



ANDHRA MAHILA SABHA NURSING HOME

## NURSES' TRAINING AND NURSING HOME

A hospital for women and children, with provision for training of Auxiliary Midwife - Nurses. This training is a special scheme sponsored by the Ministry of Health, Govt. of India based on the syllabus approved by the All India Nurses Council and comprising of Elementary Nursing, Institutional and Domiciliary Midwifery, running for a period of two years. A special ward for children and a separate Hostel for Nurse-Midwives are new additions to our Nursing Home.

Particulars about Training etc. may be obtained from the Medical Superintendent, Andhra Mahila Sabha Nursing Home, Adyar, Madras.

## NAGESWARA SISU VIHAR

A Nursery School for children of the age group 3 and 7. Admission is free for children of all working mothers whose income is below Rs. 100/- per month.



AUXILIARY NURSE - MIDWIVES UNDER TRAINING IN ANDHRA MAHILA SABHA NURSING HOME

# ANDHRA MAHILA SABHA
## NURSING HOME

| Year & month | Out Patients | In-Patients | Deliveries |
|---|---|---|---|
| 1955 January | [illegible] | 150 | 63 |
| February | 2146 | [illegible] | 66 |
| March | [illegible] | [illegible] | 95 |
| April | 3017 | 228 | 92 |
| May | [illegible] | 231 | 78 |
| June | [illegible] | 184 | 75 |
| July | [illegible] | 224 | 86 |
| August | [illegible] | 177 | 98 |
| September | [illegible] | 195 | 87 |
| October | [illegible] | 225 | 96 |
| November | [illegible] | 230 | 108 |
| December | 3179 | 250 | 109 |
| 1956 January | 2741 | 212 | 85 |
| February | 3088 | 166 | 63 |
| March | 3079 | 243 | 102 |
| April | [illegible] | 228 | 81 |

Number of Auxiliary Nurse - Midwives under training : 59. Trained and passed out 11.



DISTRIBUTION OF MILK TO POOR CHILDREN

*—A daily feature in our Nursing Home*

**ACKNOWLEDGEMENT**

The Andhra Mahila Sabha has completed 15 years of service to the Cause of women's education and welfare. Started as a recreation centre for women and children, it has grown into an Institution providing facilities for training and opportunities for service to the Nation. We take this opportunity to record our grateful thanks to the several donors and well-wishers and to the Government who have helped us to build our Vidyalaya with a Hostel in Luz Church Road, Sisu Vihar in Nageswarapuram, The Industrial Institute and the Andhra Mahila Press in Rosary Church Road, and The Nursing Home and Nurses Hostel in Adyar, and to the numerous workers who are striving to make them living and growing institutions.

B. TIMMABAI,
K. LAKSHMI RAGHURAM,
*Jt. Secretaries*

DURGABAI DESHMUKH,
*Founder Secretary*
*Trust Board.*

అన్ని నొప్పులకు

# అమృతాంజనము

**60**

సంవత్సరముల
సేవచే
పేరొందినది!




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు
బొంబాయి
కలకత్తా



"To train women workers and harness their services in the building up of the future of our Nation and Womanhood"

## జూలై 1956

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | 31 | • | • | • | • |

16. కర్కాటక సంక్రమణం, 18. తొలి ఏకాదశి, 19. బక్రీద్, 22. వ్యాసపూర్ణిమ

**ANDHRA MAHILA SABHA**
MYLAPORE : : MADRAS 4

Edited, Printed & Published by Mrs. K. Lakshmi Raghuram, B.A.,
at the Andhra Mahila Press, Mylapore, Madras 4.